# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రి.

సంపుటము 3 రాజమహేంద్రవరము 16-10-1980 సంచిక 24


—* ఈ సంచికలో *—





—11—1980 వార్షికసంచికలో సాహిత్య సృష్టిప్రేరణ, నష్టరామరూపకములు, సారంగధరుని కథ – ఒక పరిశీలన, పద్యం విలువ, ఆంధ్రసాహిత్యము-హాస్యరసము, వసుచరిత్ర నాటకీయత, భైరవుని కవితాకళ, అపరగౌతమ సంగమేశ్వరశాస్త్రి, కాళిదాసు వర్ణనావైచిత్రి, కవుల కలాలలో కలహంస మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా :

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధ సంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

వార్షిక సంచిక వెల 1-50

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము 3 రాజమహేంద్రవరము 16-10-1980 సంచిక 2

# కృష్ణశాస్త్రి భావ [నా] శిల్పము

— శ్రీ ధూళిపాళ అర్కసోమయాజి, బి ఏ

'కాకః కృష్ణః పికః కృష్ణః
కోభేదః పికః కాకయోః
వసంతకాలే సంప్రాప్తే
కాకః కాకః పికః పికః'

కాక కోకిలలకు ఈ విధంగా భేదం చెప్పబడింది. సాధారణంగా రూపు రేఖలలో కాక కోకిలల కభేదమే. అయినప్పటికీ వసంతకాలం వచ్చింది అంటే కాకముయొక్క అసలు బండారం బయటపడుతుంది నిజంకూడానూ! వసంతం భువిలో వచ్చిందీ అంటే కోకిల గళాన్ని ఆపడం కష్టమే! అది దాని ధర్మం కూడానూ! కోకిల సాధారణంగా ఆకులలో పువ్వులలో దాగుచూ వగరు వగరు లేమావి చిగురులు మేసి శ్రావ్యంగా కుహూ కుహూ రవములను లోకమునందంతటా మార్మోగిస్తూ కూస్తూ ఉంటుంది ఇలాగే కృష్ణశాస్త్రిగారి పేరు వినిపించినంతనే మనకు గుర్తుకువచ్చేవి ఆ ఆకులూ పువ్వులూ-నును లేత రెమ్మలూ! అలాగే ఆయన కూడా ఆకుల పువ్వుల దాగుచూ భావ గీతాలే కలకూజితములు కాగా కుహుకుహు రవములతో శ్రావ్యమైన కవితా గానాన్ని లోకంలో మార్మోగించారు అనడంలో అతిశయోక్తి ఏ మాత్రంలేదు అట్టి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అనే భావకోకిల 'నాకిక అమని లేదీ భువిలో' అని తలంచి కలవిహంగమ పక్షముల తేలియాడుచూ విహాయస పథమును బట్టి తారకామణులలో తానొక తారయై మాయమైనారు నిజానికి వారు ఆశించినట్లుగనే ఆకులలో పువ్వులలో దాగిపోయారేమో!

'క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనే చెదరిపోవ
గగనతలము మార్మ్రోగగ కంఠమెత్తి
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు'

అని ఆత్మాశ్రయ కవితకి జీవంపోసి స్వేచ్ఛా గానఝురులను సురుచిర సుందరోన్నత విశుద్ధ మహాద్భుత భావశక్తితో భవ్యభారతీ రమణీయ పద సరోజ జీవనమ్మునఁ బ్రవహింపఁజేసిన యపర భగీరథుఁడు మన దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారు వారి 'కృష్ణపక్షం' అనే కావ్య సరోవరంలో క్రీడా మరాళమై విహరించి నేను గ్రహించిన కవితాతంతువులఁ గొన్నింటిని జవిచూపుటకు ప్రయత్నింతును.

కృష్ణశాస్త్రిగారిరచనలో మకుటాయమానమైన దీకృష్ణపక్షకావ్యము అసలు కావ్యం అనే దానికి వారిచ్చిన నిర్వచనము

'ఊపి ఊపి మనసు నొక్కొక్క వేదన
కావ్యమౌను మరియు గాన మౌను'

అని తమ 'పల్లకీ' కావ్యంలో తెలియజేసినట్లుగా ఈకృష్ణపక్ష కావ్యంగూడ కవిహృదయ ప్రదర్శన రూపమైన ఒక దర్పణము లాంటిది ఇందులో వేడుకలున్నాయి. వేదన లున్నాయి. కవిది తీరని చిచ్చు-తీరని తృష్ణ' అని వారే చెప్పుకున్నారు గూడా అట్టి ఈ కావ్యంలోని భావనాశిల్పము నించుకంత పరిశీలించి ఒండు రెండు ఉదాహరణములను గైకొం

దము 'స్వేచ్ఛాగానము' అనేఖండికలో

'యుగయుగంబుల నీశ్వర యోధులగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించు వారి
అమల జీవిత ఫలము ధన్యతను గాంచ
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు'

అన్నారు ఆ విధంగానే తమ జీవితాన్ని అర్పించుకున్నారుకూడా! 'పలవిషమైన తుచ్ఛ జీవనము విషము' అని అసలైన ప్రేమతత్త్వాన్ని తెలియజేశారు 'నా వియలకోట' అనే ఖండికలో ఒక్క ఉదాహరణము ఇది కృష్ణశాస్త్రిగారి

ఊహాశాలితను పట్టుచూపుతుంది. వారి విరులతోటలో ఒక్క పవడపు గులాబి మొక్కను పెంచారట. దానికి వర్షం కావాలిగదా! వారి ప్రణయ జీవనమే ఆ వర్షమట! సరే! అదృష్టం పండింది మారాకూ తొడిగింది పైగా మొగ్గగా పువ్వుగా మారింది కూడా! ఆ పువ్వూ-తానూ పరస్పరమూ చూచుకుంటూ కాలం వెళ్ళబుచ్చారట! రోజులు అన్నీ ఒకలా ఉండవు గదా! సరే! ఇంతవరకూ కథ 'కామెడీ' లోనే నడిచింది అక్కడంటారు మన కవీంద్రులు చూడండి ఈ క్రింది పద్య ప్రసూనము

ఎట్టు లది దాపురించెనో యేమొ యంత
నాకు సందుల త్రోవల నల్లదిగియె
నొక్క క్రూరార్క కిరణమ్ము, ఉర్వి వాలి
నా గులాబి సోలియు తూలి నన్ను వీడె

అంటారు ఎంతటి భావనాశక్తి! ఆ తేటగీతిలోని ఎత్తుగడలూ, దింపుగడలూ ఒక్కసారి పరిశీలిద్దాం ఇందులో మన కవి ఆ క్రూర అర్క కిరణముయొక్క ధాటిని అక్షర విన్యాసంలో ప్రదర్శించారు అర్క కిరణముల ధాటికి ఆ గులాబి సోలిపోయినట్లుగనే నాల్గవపాదం అర్కగణం వలన ఆ'గులాబి' అనే పదంగూడా విరిగిపోయింది ఆపయి వరసగా నడచిన వగణములు ఆగులాబి సోలినరీతిని వ్యక్తం చేస్తున్నాయి తరువాత ఆగులాబి సోలినందులకు సంతాపం వ్యక్తం చేశాయి కోయిల మరియు మందపవనము ఎంతటి అపూర్వ కల్పన! సాధారణంగా మన కవులకి లోకువైన పద్యం తేటగీతి అట్టి చిన్నిపద్యంలో ఎంత భావాన్ని ప్రదర్శించారో కదా! ఒక చిత్తరువును మన కళ్ళముందుంచారేమో! పరిశీలింతురు గాక!

ఇక 'నాకమరణమ్ము' అనే ఖండికలో మరణం అనేటువంటిది లేతనుడియట! తుది మొదలు కానరానట్టి మహాంధకార కలుషిత కృష్ణపక్షంపువీథియట! అట్టి మరణాన్ని తాము కోరలేదట! ఎందుకో తెలుసా? అందులో స్వార్థం ఏ మాత్రం లేదు ఈ విషయంలో వారి సమర్థనను తిలకిద్దాం

కరముకరమున కీలించి కలసి మెలసి
యున్న సహధర్మచారిణి మధుర మధుర
మూర్తి, ప్రియురాలు, సఖురాలు పూర్ణరాగ
కలిత, నా దుఃఖమసువులే తొలగిపోవ
వీడిపోవునేమో యను వెరపువలన
నాకు మరణమ్ము వల దని నాను.

చివరికి 'ఏను మరణింపుచున్నాను' అంటారు మరో ఖండికలో దానికి కారణం ఎన్ని ఎన్ని నిశ్వాసము లెగసినవియొ' ఎవరి కెరుక. ఇదే సందర్భంలో ఆయనంటారు 'నాకొరకు చెమ్మగిల నయనమ్ము లేదు' అంటూ బాధపడతారు నిజానికి ఆ సందర్భంలో

ఇదియె నా చితి, పేర్చితి నేనె దీని
వదలిపోని నా యవసాన వాంఛ గాగ,
వడకని కరాల రగులుచు దుడుకు నిచ్చు
లాలసల కింత నుసిగాగ కాలం త్రుటినె!
అలరియు నా తెర యూర్చు గాలులు కదల్చి
రేపు నంతే నా కష్టాల రేగుమంట .

అంటారు నిజానికి పైపద్యాలు చిన్న పాఠకులు కన్నీరు కార్చని వారుండరేమొ! చెమ్మగిల్లని నయన ముండదేమో!

చివరిగా 'అన్వేషణము' అనే ఖండికలోని ఒక సీస పద్యాన్ని పరిశీలిస్తే కృష్ణశాస్త్రి గారి ఊహావైభవం, మనసు దోచుకుంటుంది ఆ పద్యమిది

ఎలదేటి చిరుపాట సెలయేటి కెరటాలఁ
బడిపోవు విరికన్నె వలపు వోలె
తీయని మల్లెపూదేనె సోనలపైని
తూగాడు తలిరాకు దోనెవోలె
తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై
పరువెత్తు కోయిల పాటవోలె
వెల్లువలై పారు వెలది వెన్నెలలోన
మునిగిపోయిన మబ్బుతునుకవోలె
చిరుత తొలకరి వానగా చిన్నిసోనగ
పొంగిపారెడు కాల్వగా నింగి కెగయు
కడలిగా పిల్లగ్రోవిని వెడలు వింత
తీయదనముల లీనమై పోయె నెడద.

పై పద్యంలో కృష్ణశాస్త్రి భావప్రవాహం చక్కని గమకంతో నడిచింది. వర్ణించెడు వస్తువు పిల్లగ్రోవినుండి వెడలు తీయదనము. పద్యం ఎత్తుగడను పరిశీలిస్తే నిజానికీ పద్యం మురళిపై వాయించడానికి ఎంతో అనువుగా ఉంటుంది. అంతవరకూ ఎందుకు? మొదటి పాదం చదివితే చాలు! ఆ మురళీ నినాదం మనసుకి తగలక మానదేమో! సగణము ఆపయి లఘువుతో నడచిన భావప్రవాహం ఆ మాధుర్యం అనుభవింపఁ జేస్తుంది అలాగే రెండవ పాదంనుంచీ ఆ లయకు అనుకూలంగా గణాలని సమకూర్చారు. ఇది కేవలం సీస పద్యంగా చదివితే ఆ భావం అందదేమొ! బహుశః శాస్త్రి గారి 'తిరుప్పావు' లోని సంగీత లహరి ఒక్కసారి గుర్తుకు వచ్చిందేమో! అని ఊహ మాత్రమే!

ఈ విధంగా కృష్ణశాస్త్రి గారు భావ కవితా కూజితములు వెల్లిగ్రక్కు పక్షిగా మధుపముగా, చందమామగా, ఆవులో ఆవుగా అలరుగా, చిగురాకుగా, పాటగా అడుగడుగునా దోబూచులాడుతూ కృష్ణపక్షపు త్రోవలఁబట్టిపోయి ఆ సర్వేశ్వరు హస్త జలజ యుగ్మమున హాయిగా విశ్రాంతి నొందుచున్నారు. అట్టి మహనీయుని కివే నా దోఃపుటాంజలులు—

— —

# శివశంకరులు - కవిప్రియ

(గతసంచిక తరువాయి)

- శ్రీమతి కె. వి. శ్రీరంగనాయకి, ఎం. ఏ.

## ప్రథమరంగం

కవిప్రియ యామినీ పాలికావయస్య యగు కేరళిక సంభాషించుటతో ప్రారంభం అవుతుంది

"అన్యభావము వీడి యేకాగ్రమ వయి
పారవశ్యమ్ముచే గురుపాదపద్మ
యుగళిపై వ్రాలి సంశ్లేష మొందకుండ
మసలెదేటికి అటునిటు మానసంబ"

యామిని ఈపద్యం రచించు సమయానికి నాలుగు నెలల చదువు పూర్తయింది కవిత్వం చెప్పటానికి ఉత్సుకురాలైంది యామినికి సరసకవితా ప్రవీణత కలిగినప్పటినుండీ తన హృదయం ఏమూర్తిపై లగ్నమైందో ఆ మూర్తినే భావించి కవిత్వాన్ని చెప్పింది. ఇట్లు చెప్పడం లోకానుభవసిద్ధం యామిని బిల్హణభట్టునందు తన మనస్సునందుగల అవస్థలను వర్ణించింది. యామిని కోరిక ఇది.

'కరగి పోసిన బంగారు కాంతిమీరు
దేశిక మహాశయు పవిత్ర దివ్యగాత్రి
యష్టియూతగ నెగబ్రాకి అంతరిక్ష
విగ్రహమువోలె నుండవే వెఱ్ఱిమనస"

దీనిని విని కేరళిక ఇందలి అంతరార్థమేమో కాని అగనిట్టుల శోచదు ఎంచి చూడగా బిల్హణార్యుడేమి తలచునో అని ప్రశ్నార్థకంగా చూస్తూ ఇలా అంది

కా వచ్చునె గురుస్తోత్రము
గానె బహిరంగముగ పద్యము
లరయ ననురాగమ్ము తోచదె
అనస్యూతముగా?

యామిని ప్రేమ కాదు భక్తి యనుకొనరాదా? అన్నది దానికి కేరళిక

ఆదిలో అనురాగ మంటురు
అవల దానిని భక్తి యంటురు
ఇంతలోనే యెదిగి పైపై
కెక్కిపోయె చెలీ!

అని యామినిని వ్యాఖ్యానించి బుజం తట్టింది యామిని బిల్హణుని అభిప్రాయం తెలిసికోదల్చి కేరళికతో నేను వారివద్ద పద్యాలు చదివేటప్పుడు నీవు నాకు కనపడవద్దని ప్రార్థించింది ఈ సమయంలోనే బిల్హణకవి ప్రవేశించాడు నమస్కారాలు జరిగాయి ఈ సమయంలో పాఠం ప్రవచించడానికి ఏ మహాకవి గ్రంథాలు తెచ్చావు? రాకుమారీ! అని చేయి చాపాడు యామిని చేతిలో ఆమె అనిబద్ధకావ్యం వ్రాసుకొను సుందర గ్రంథముంది

అందలి పద్యాలు కన్నులతోనే పఠించి ఆమెకిచ్చి యామిని కవయిత్రి అయింది ఈపద్యాలెప్పుడు రచించిందనగా ఆమె సమాధానం చెప్పిం(ది)

గతరాత్రి పానుపుమీద పరుండ కౌముదీకాంతి వాతాయనం వెంటవచ్చి నా తనువును పాండురపటవాసభూతితో ముంచెత్తింది అప్పుడు గడియలు దాటినాయి కాని కనులు మూతపడలేదు ఆ గగనహంసాన్ని వీక్షిస్తుండగా దానిలో మీయొక్క ఆస్యబింబం గోచరించింది

అప్రయత్నంగా నా ముఖంనుండి ఈ ఖండకావ్యం వెలువడింది దీనిని నేనెప్పుడు రచించానో తెలియలేదు అంది కవి పద్యాలు చదివి మెచ్చుకొన్నాడు. కానీ అందలి అనురాగాన్ని గ్రహించినట్లు అభివ్యక్తం చేయలేదు "కావ్యవస్తువుగ! వెలయదె ధిషణలో విషయాంతరమ్ము"? అన్నాడు యామిని "స్ఫురియింపకుండుటే శుభదాయకమ్ము" అంది యామిని తలవంచుకొని దేవతాస్తవం కన్నా దేశికస్తవం గ్రంథంలో ఉండటం కళ్యాణదాయి అంది బిల్హణకవి ఆమాట అంగీకరించి, అభినవసిద్ధాంతం ఆవిర్భవించిందని నవ్వాడు. అభినవసిద్ధాంతమంటే క్రొత్త సిద్ధాంతమనీ, అభినవగుప్తపాదాచార్యుల సిద్ధాంతమనీ శ్రీ శివశంకరుల అభిప్రాయం

తరువాత యామిని కాశ్మీరు చూడాలని కోరగా "నీవు అసూర్యంపశ్యవు కావున అంతఃపురం విడిచిపెట్టి రారాదు" కావున నీ తల్లిదండ్రుల యాజ్ఞతో "రాజపుత్రుని, మహాయోధుని, రాణి వయ్యెదవు" అనగా యామిని రాజపుత్రుడన్నను వివాహమన్నను నాకు కోరిక లేదు నేను నిన్నే వివాహమాడతాను. నామాట నమ్ముమనెను బిల్హణుడు యామినికి ఎటువంటి వరుడు కావాలో అని ఏ విశేషణద్వయాన్ని వాడాడో దాంతోనే 'గురుమహారాజ'! అని సంబోధించింది

అప్పుడతడాలోచించి జ్యోతిషం కూడా చెప్పాడు "నాకు కార్తాంతికులు శీఘ్రకాలంలో ఏదో ఒక పెద్దగండమనీ ఆ తరువాత ఊహల కందరాని గొప్ప మంగళం చేకూరుననీ, చెప్పారు" అని ఈ మాట వినగానే యామిని ముఖంలో వివిధ భావాలు, అవస్థలు పరిభ్రమించాయి ఆతడు రెండు మాసములు పరిభ్రమించి వత్తుననగా యామిని ఏమాత్రం ఒప్పుకోలేదు పైపెచ్చు మీ ప్రియశిష్యురాలు మీ "గళవకుళ మాల" వాడనీయ నని అభయంకూడ చెప్పింది

ఆసమయంలో ధుర్గపాలుడు, కోటి పాలుడు వచ్చి యామినికి విద్యాపరీక్ష జరుగుతుం దని తెలియచేస్తాడు ఇది ప్రథమరంగంలోనివిషయం ఇక రెండవ రంగంలోని విషయం

రెండవ రంగం

సప్తావనీ ప్రాసాదంలో ఉండగా కవి వాతాయనం నుండి చంద్రబింబాన్ని చూసి మృదుమధురంగా

''మారనారాచ నిస్సాణ
శాణోపల మి వోదితమ్।
యామినీ కామినీ కర్ణ
కుండలం చంద్రమండలమ్॥''

రాత్రివేళ బిల్హణకవిమందిరానికి రాదల చిన యామినికి యామినీ శబ్దోచ్చారణము మంచి అవకాశాన్ని కలిగించింది తలుపు గడియవేసి వచ్చిన యామినిని చూచి నీవేల వచ్చితి వనగా నాపేరు వినబడి వచ్చాను అని సమాధానం చెప్పింది

కవి ఆనాడు తాను వ్రాసిన పద్యాలు చదువుతున్నానని పల్కగా వినిపింపు మని ప్రార్థించింది కవి వినిపింపగా విని

'పురందర దిగంగనా
శ్రవణకుండలం మండలమ్।
యామినీ కామినీ కర్ణకుండలం''

ఈరెంటినీ పరిచూచి గురువులకు తరుణీ కుండలాలు మీద ఉత్సుకత గావున గ్రహింపు మని తన కర్ణకుండలాలు తీసి యివ్వబోయింది ఈకల్పన ఆ కవికిని కవి ప్రియకును సమర్థమై సుకుమారంగా నొదిగింది

కవి పద్యాలను వినిపించాడు. యామిని వ్రాసికొంటా ననగా కవి వారించి వెడలి పొమ్మన్నాడు నేనువచ్చింది నాపద్యాలు వినిపించటానికి గూఢమార్గాన వచ్చాను అని బదులుచెప్పినా కవికఠినరీతి వెడలి పొమ్మన్నాడు ఎట్టకేలకు కవి శిష్యురాలి పద్యాలను వినటానికి అంగీకరిస్తాడు నిషణ్ణకంపై కూర్చొని యామిని పద్యాలు వినిపిస్తుంది కవి శిష్యురాలి రచనా విధానాన్ని మెచ్చి పొద్దుపోయింది పొమ్మన్నాడు.

యామిని నాల్గడుగులు వేసి వెనక్కు తిరిగి తనకు గలిగిన సంశయాన్ని వివరింపు మనగా, ఆమె కామసూత్రాల్ని చదువుతున్న దని గ్రహించి వివాహపూర్వం వద్దని మృదువుగా మందలించాడు దీని ఫలితం పునః పరిష్వంగం పరిణామానంతరం సూత్రపరనఫలం జ్ఞాతసమ్మోద చర్విత చర్వణం.

బ్రాహ్మణుల వాక్కు పరుషమనియు హృదయం నవనీత మనియు పూర్వకవులు నిర్వచింపగా ఈకవి సార్వభౌములు [బ్రాహ్మణకవివాక్కు] బిల్హణునివాక్కు మధువు నధఃకరిస్తుంది హృదయం వజ్రం కన్నా కఠినంగా ఉంటుంది. (అనురాగ విషయంలో) అన్నారు బిల్హణుడు ఇలా సమాధానం చెప్పాడు.

స్త్రీల హృదయాలవలె మాహృదయాలు శిష్యురాండ్రపై మాత్రం కఠినంగా బ్రాహ్మణులకు అని నేనునైష్ఠిక బ్రహ్మచారిని కాను నేను నీ అనురక్తిని గ్రహించాను కాని నీ వసూర్యంపశ్యవైన రాకుమారివి అన్యులు చూచిన బాగుండదు వెడలిపొమ్మన్నాడు

అప్పుడు యామిని తన ప్రీతిని కార్యరూపాన వ్యక్తంచేస్తూ జాలిగా తనను అంగీకరింపు మని వేడుకుంది అప్పుడు కవి నీప్రేమ నిష్కల్మషమే కాని లోకంలో శిష్యురాలికి వలపుతలకెక్కించి కలలోవేసికొన్నా డని అప్రతిష్ఠ వస్తుం దని సందేహించా నన్నాడు అపుడు యామిని ప్రతిజ్ఞాపూర్వకంగా ఇలా అంది

'శివశివా మీరేమి చేసినారలు స్వామి
గాఢరక్తిని స్వయంగ్రాహమ్ము చేసితి
యామినీదేవియే యను దైవతము సాక్షి'

అని వారి వివాహ విషయానికి కూడ ఉపాయాన్ని చెప్పింది నేను చాల తొందరగా మాతల్లితో చెప్పి సమ్మతింప చేసి ఆమెచే మన మనోరథమును నాతండ్రికి చెప్పింతును తండ్రికూడ ఒప్పుకొను నని పల్కుతుంది. ఇన్నివిధాల భయాన్ని తీర్చినా కవి అనుమానిస్తున్నాడు అప్పుడు యామినికి కోపం వచ్చింది వెంటనే మరల కవి అనునయింప వలసి వచ్చింది అప్పుడు కాశ్మీర మధుర సుకుమారంగా యామినీ తీక్ష్ణ కటాక్ష పాత వ్రణాలకు ఔషధాన్ని ఉపదేశించాడు

''ఇందీవరాక్షి తవతీక్ష్ణ కటాక్షబాణ
పాతవ్రణ ద్వితయ మౌషధ మేత దేవ
ఏకం త్వదీయ మధురాధర పాన మన్యత్
త్వత్తుంగ పీనకుచ కుంకుమ ''

యామినీ వల్లభ సన్నిధానమువనే యామినీవల్లభులకు పరస్పరపాణిగ్రహణం జరిగింది. ఇప్పుడు యామినికి సిగ్గువచ్చింది.

''నేదం ముఖం మృగవిముక్త శశాంక
బింబం
నేమౌ స్తనా వమృతపూరిత హేమకుంభౌ।
నైవాలకావలి రియం మదనాస్త్రశాలా
నైవేద మక్షియుగలం నిగలం హి
యూనామ్॥

ప్రతి పదం రసస్యందిగా కవి ప్రియమైంది ఈ రూపకానికి ధర్మపత్నీతను శ్రీ శివశంకరులు మనోహరంగా చిత్రించారు ఇక మూడవ రంగాన్ని పరిశీలిద్దా

మూడవ రంగము

కవి సాయంకాలం పాఠశాలాభవనంలో ఇటు అటు తిరుగుతూ తమ మధుర స్మృతులను స్మరిస్తుంటాడు అప్పుడు యామిని ప్రవేశించి అస్ఫుటాక్షరాలలో అర్ధనిమీలిత నేత్రుడై స్మరించటం గమనించి ప్రశ్నిస్తుంది ఆమె ప్రవేశించటం ఉచితం అనుగుణమైన సంభాషణ కౌత

నడచిన తరువాత సభలో చదువవలసిన పద్యాలను సరిచూచి

"శిష్యురాలికి శుభజయసిద్ధి రస్తు
ప్రాణకాంతకు మంగళప్రాప్తి రస్తు"

అని దీవిస్తాడు.

ఇంతలో కోటిపాలుడు, రాజు, అమాత్యుడు, రాజగురువు ప్రవేశిస్తారు ఉచిత మర్యాదలు నడచిన తరువాత యామిని తాను వ్రాసిన పద్యాలను వినిపిస్తుంది

యామినీదేవి గురుచరిత్రను వ్రాయుట శ్రీ శివశంకరుల ప్రజ్ఞాసమున్మేషం విక్రమాంకదేవ చరిత్రలోని 18వ సర్గలోని బిల్హణచరిత్రే ఇందు అనూదితమైంది సాహితీమర్మజ్ఞులైన చక్రవర్తులు గాన కవిప్రియను రసోచితంగా నిర్మించారు

కవిప్రియ కావ్యగానం చేస్తున్న సమయంలో కవి ఆశ్చర్య, ఆనందాది భావములను చక్కగా పరిపోషించారు. ఇట్టి భావశబలతను వర్ణించినవారు ఈ యుగంలో చాల తక్కువమంది యని చెప్పవచ్చును

తరువాత సభ్యుల కోరికపై కవి తాను వ్రాసిన పద్యాలను చదివి వినిపిస్తాడు అంతట రాజు కవిని విద్యాపతిని చేసి సత్కరిస్తాడు. ఆ సత్కారం యామినీదేవి హస్తం ద్వారా జరుగుతుంది

అనగా బిల్హణకవిని విద్యాపతిని చేసినటు ముక్తాహారాన్ని సభలో యామినిచే బిల్హణకవికి రాజు మదనభూపతి స్వయంగా అలంకరింపచేశాడు అది యామినికివలె కవికి కూడా ఎంతో సంతోషకరం వీరిమధ్యలో నున్న మధుర ప్రేమగాథ ఎవ్వరికీ తెలియదు

కావున అప్రయత్నంగా హాసాదులు జరుగుతాయి కవి తలను వంచుతాడు. యామిని కూడ గంభీరవదనతోనే హారాన్ని మెడలో వేసింది ఇది మూడవ రంగమునందలి కథావిషయం ఇక నాలుగవ రంగాన్ని పరామర్శిద్దాం

సా ఉ గ వ ర ం గ ము.

బిల్హణకవి తన మందిరంలో సాయం సమయంలో యామిని పటంవంక చూచి మధురస్మృతులతో చందన చర్చ సలుపుకొంటున్న సమయంలో యామినీదేవి ప్రవేశించి వ్రేలాడుతున్న కాండపటాన్ని చాటుచేసికొని కిలకిలనవ్వుతుంది అపుడు కవి అటుతిరిగి

"చిత్రగత యైన నత్ప్రేయసీ ముఖమ్మె
జీవముల దాల్చి వేడ్క హాసింపనోపు"

అన్నాడు. అప్పుడు యామిని కొంచెం కాండపటం దింపుతుంది అప్పుడు కవి కమిందుః? కింపద్మం? ఇత్యాదిగా పద్యం చదువుతాడు చందనాగురు ఘన సార సాంద్రలిప్త మగు హృదయేశ్వరార్ద్ర వక్షమును గాఢంగా ఆలింగనం చేసుకొంటుంది. కవి ఇచ్చట పద్యమునందలి దీర్ఘ సమాసఘటనతో మాధుర్య ప్రగాఢతల నిమిడించెను ఇది వారి పారస్పరిక ప్రేమానుబంధంవలెనే బంధురమై మనోజ్ఞమైంది

బిల్హణకవి యామినిని శిష్యురాలిగా గాని, రాజపుత్రిగా కాని భావింపలేదు ప్రియురాలిగా, ఇష్టదైవతంగా భావించాడు యామిని బిల్హణునితో

"చాల సరసవార్త చల్లని శుభవార్త
మిగుల మధురవార్త మేలివార్త"

నేను చెపుతాను. నాకేమి పసదనం? ఇస్తా రని ప్రశ్నించింది మన వివాహానికి నీ జ నీజనకులు సమ్మతించారా? అని కవి ఉత్కంఠతో ప్రశ్నిస్తాడు తల్లికి, తనకీ జరిగిన సంభాషణ తెలియజేస్తుంది యామిని తన తల్లితో వివాహవిషయాన్ని ఇలా చెప్పింది నా హృదయనాథుఁడు, కవివతంసుడు అమృతధాముడు అగు కవిని తప్ప అన్యుని నేను వరింపను అని ఖండితముగా చెప్పింది ఆమె మనోనిశ్చయానికి కవి ముఖం వికసించింది అట్టి ప్రాణనాయికకు పారితోషికంగా గాఢాలింగనం బహూకరించాడు

ఈ వీరి వివాహానికి తల్లి అంగీకరించిన తరువాత పుస్తకాలు చూడబుద్ధి పుట్టలేదు ఆనందోత్సాహంతో నాట్యం చేస్తూ వేరొక తీయని వృత్తాంతాన్ని ఎరుకపరచునో ఏమి ఎహూకృతి? ఇపుడు నా తల్లిదండ్రులు మన వివాహ మంగళ విషయమునే మాట్లాడుచున్నారు ఈ నిమిషంలోనే ఆహ్వానం కూడా వస్తుంది. అని చెప్పిన ప్రియురాలిని "సంగీతవిద్య యందు వత్సరాజుచే వాసవదత్త ఓడినది ఆ వాసవదత్తకంటె దేశిని నోడించిన తన ప్రియురాలు చతుర యని ప్రశంసించాడు,

అప్పుడు యామిని కవిగంధ సింధురం ఎంతెంత సిలుగులపెట్టి నిల్చెనో అనగా కవి

"కవులు గంధ ద్విపమ్ములే కాని తుదకు
ప్రేయసీ పాదయుగళి స్తంబేరమములె
పడుచుహృదయాల కంతుళ ప్రాయమగును
ప్రణయినీ రమ్యవీక్షణబాణ వితతి"

అని గంధద్విపస్థ భేద శబ్దాల సార్థక్యాన్ని వివరించారు

"కామం నృపాః సన్తు సహస్రశోన్యే
రాజన్వతీ మాహు రనేన భూమిమ్"

అన్న మాటను గుర్తుకు తెచ్చే వాక్య విన్యాసం సంస్కృత సాహిత్య సర్వవిధ ప్రక్రియలను పుక్కిటపట్టిన శ్రీ శివశంకరులకు హేలాప్రాయం యామిని

"వత్సరాజ ప్రియాకథా వర్ణనమ్ము
చేసినారెందరో కవిశ్రేష్ఠులు మును"

అనగా కవి

'మదనభూపాల పుత్రికా మధురగాథ'ను

కావ్యముగా మహాకవు లికముందు రచింతు రని చెప్తాడు ఆ మాటకు యామిని ఆనందాన్ని పొంది అవనిపతి పుత్రికానామము విస్మృతిగర్భంలో కలసి పోవును కానీ కవిప్రియ మాత్రం అక్షర మైన రమ్యగాథ యని తాను కవిప్రియ యాటయే ధన్యతగా భావించింది కవిని ఆలింగనం చేసుకొంది "మధురబంధమ్ము లోపలే మరణసుఖము" కవి పలికిన పిడుగుపాటువంటి ఆ మాటను సహింపక యామిని కవి నోటిపై చేయి వేస్తుంది అదే సమయంలో కోటిపాలుడు వచ్చి తలుపుతట్టి గూఢవృత్తాంతం ఉంది ఏకాంతంగా మనవిచేయాలనగా యామిని వివాహవృత్తాంతంగా తలంచి నాకు జీవి తేశ్వరునకు చాటుమాటు లేదు అంటుంది అప్పుడు కోటిపాలుడు యామినివైపు జాలిగామాత్రం చూసి రాజాజ్ఞ యని కవినిమాత్రం వెంటబెట్టుకొని వెళతాడు మీరు తిరిగి వచ్చేవరకు నేనిక్కడే ఉంటానని కవిపై కాశ్మీరంపు దుశ్శాలువను కప్పి సాగనంపుతుంది వాళ్ళు కనిపించినంతవరకు చూసి కుడ్యంమీద ప్రకాశించుచున్న బిల్హణకవి చిత్రపటం చూసి మందహాసం చేసి, పైట సవరించుకొని, వెనక్కు తిరగ్గానే కుడ్యంమీద ప్రకాశించుతున్న అర్ధనారీశ్వర చిత్రపటం ప్రత్యక్షమౌతుంది వెంటనే కైమోడ్చి అర్ధస్ఫుట స్వరంతో

అచ్ఛిన్నమేఖల మలబ్ధదృఢోపగూహ
మప్రాప్తచుంబన మవీక్షిత వక్త్రకాంతి।
కాంతా విమిశ్రవపుషః కృతవిప్రలంభ
సంభోగసఖ్య మివ పాతు వపుః పురారేః॥

ఈ స్తుతి ఎంత ఉచితమో ఔచిత్య విచారం ఆత్మధర్మంగాగల మహాకవులకు, సహృదయులకు మాత్రమే తెలుస్తుంది పార్వతీ పరమేశ్వరుల మేళనంవలె సంపృక్తాలైన యామినీ బిల్హణులకు హృద

(తరువాయి 7 వ పేజీలో)

# ❋ మత్తకోకిల ❋

— శ్రీమతి జి కమలారాఘవన్

* నీవు సారెల మావికొమ్మల
  నిల్చి యూయల లూగుచున్
భావముల్ ప్రణయాబ్ధిదేలగ
  పాంథులన్ తమిబిల్చుచున్
భావనారతి నిండియుండ ప్ర
  భాతవేళల వేడుకన్
పావనంబగు పంచమస్వర
  భాతి పాడెదు కోకిలా!

* ఏమి మంత్రము వేసె నీపయి
  నెంచి చూడ వసంతుడున్
ఏమి యంత్రము గట్టె నీకర
  హించగా నిల చైత్రుడున్
ఏమి తంత్రము జేసె నీకు మ
  తెంతొ కూరిమి మారుడున్
ఏమి మంత్రములేక నేర్తువె
  ఇట్టిపాటను కోకిలా!

* గొంతులో అమృతంపు కుండిక
  కూర్మిమీర నమర్చియున్
అంతపైనటు ద్రాక్షమండె హృ
  దంతరమ్మున నిల్పియున్
వింతగా నల యిక్షుసారము
  వేడ్కపుక్కిట బెట్టియున్
ఎంత నేర్పున నిన్ సృజించెనొ
  యెన్నగా విధి కోకిలా!

* మత్తుగా చిగురాకు జొంపము
  మాటిమాటికి మేయుచున్
హత్తియాకస వీథిలో తమి
  హాయిగా విహరించుచున్
చిత్తముత్సుకమై కుహూ కుహు
  చిత్రరావము లొప్పగా
కుత్తుకన్ ప్రజ మోదమౌగను
  కూయుచూసెదు కోకిలా!

* పూవువిల్తుని వింటినారివొ
  పూన్కివాణి విపంచివో
శ్రీవిలాస పదాబ్జశింజవొ
  సిద్ధకంజరి మువ్వవో
దేవకీసుతు వేణురవమవొ
  దివ్యకిన్నర తంత్రివో
యీవు గాక మనోజ్ఞరాగము
  లెట్టు లబ్బును కోకిలా!

* సారసాక్షి వసంతలక్ష్మికి
  జన్మవాసర పూజకున్
పేటంబుకు బిల్వవచ్చిన
  పెద్ద యైదువ వౌచు వే
మారుబంటువు నౌచు లోకము
  మల్లడింపగ జేయుదే
దూరతీరము లేగు పాంథుల
  తోడు గాగను కోకిలా!

* ప్రీతిమీరగ గ్రుడ్డువెట్టియు
  బిడ్డ జేయగ రాక నీ
మాతకాకము గూటికిన్ ప్రియ
  మార జేర్చిన కాకి దా
మాతయై నిను బెంచుచుండు స
  మానదృష్టిని బూని నిన్
కూతవట్టినతోడ ద్రోయును
  కూర్మి వీడుచు కోకిలా!

* కన్నతల్లికి దూరమై మరి
  కాంక్ష బెంచెడి దాదికన్
ఎన్నగా పగదానవై యిటు
  లెంతకాలము ద్రోతువో
విన్న నీచరితంబు నామది
  వేసటన్ కలిగించుగా
కన్ననోముల పంటయే యిటు
  కానవచ్చెనె కోకిలా!

* ఇంత నేర్పరి నీకు రూపము
  నీయగా మరపొంది దా
నెంత మోసము సల్పె ముందుగ
  నేమి పాపముఁ జేసితో
రంతులన్ చెలరేగి యామని
  రాగ మొప్పచరించుటన్
ఇంతసీదు నమాయికత్వము
  నెంచజాలను కోకిలా!

— —

## "తెలుగు వెలుగు"

- శ్రీ ఎస్. ఎస్. మోహనశర్మ



* తెలుంగుమాట తేట, తియ్యదనపుమ్రాట
దీప్తినొసగుబాట, తేటిపాట
వనమయూరియాట, ప్రణయాల పూదోట
తెలుగునాటిమాట వెలుగుబాట.

*మందమారుతంబు, మకరందముల విందు
పికకుహూరవంబు, ప్రేమపొంగు
పండువెన్నెలగమి పరమసుగంధంబు
తెలుగునాటిమాట వెలుగుబాట.

* మా తెలుంగతల్లి మమతల సుమవల్లి
ప్రథితభావములకు పాలవెల్లి
సుగుణపుంజములను శోభిల్లు తల్లిరా
తెలుగునాటిమాట వెలుగుబాట.

* ఆంధ్రపౌరుషంబు లవనికే మూలమ్ము
లాంధ్రకావ్య రీతు లమృతఝరులు
ఆంధ్రజనుల ప్రేమ యవధిలేనట్టిది
తెలుగునాటిమాట వెలుగుబాట

—•••—

( 6 వ పేజీ తరువాయి )

యాలు అవిచ్ఛిన్నాలు. ఆ విషయాన్ని శ్రీ శివశంకరులు సాధుమార్గంలోనే ధ్వనింపజేశారు.

ఆసమయంలోనే కేరళిక ససంభ్రమంగా వచ్చింది. యామిని చేతులు చాచింది. దీనితో నాలుగవరంగం కథ పూర్తవుతుంది. ఇక అయిదవ రంగం కథ

( సశేషం )

## ప్రేమ్‌చంద్ "గోదాన్"

- శ్రీ నసుమాస స్వామి, ఎం. ఏ.

హిందీ, ఉర్దూ సాహిత్యంలో అగ్రశ్రేణికి చెందిన రచయిత ప్రేమ్‌చంద్. ఆయన గోదాన్ నవల భారతీయసాహిత్యంలో ప్రత్యేకస్థానాన్ని పొందుపర్చుకుంది. గ్రామప్రాంతాలలో బీదరికంతో క్రుగ్గుతూ పెత్తందారీ తొక్కిడిలో నలిగి దుర్భరజీవితం గడిపే భాగ్యహీనుడగు రైతు కథే గోదాన్. అట్టడుగున బడి అన్యాయాలకు, అక్రమాలకు, గురై కష్టార్జితధనం దండుగలకే నిండుకొనగా చివరికి తాను, భార్య, పిల్లలు, కూలీలుగా మారిన హృదయవిదారక కథ గోదాన్ కథ. సంఘాన్ని ఎదిరించి బ్రతుకలేక ఆత్మాభిమానాలను చంపుకోలేక అనుభవిస్తూకూడా ఆపదలనుకొని తెచ్చుకొనే ఉదార స్వభావుడు కథానాయకుడైన హోరీరాం. అరువుక్రింద ఆవును సంపాదించి ఆ ఆవుతో అష్టకష్టాలపాలై చివరిదశలోకూడా ఆవు తలంపుతోనే అస్తమించిన ఆగర్భదరిద్రుని కథ ఈగోదాన్ నవల. హిందూమతంలో గోవుకున్న వైశిష్ట్యాన్ని తెలుపుతూ, కథను హోరీరాం పాత్రను హృదయ విదారకంగా చిత్రించిన ప్రేమ్‌చంద్ రైతులోకంపట్ల, పల్లెజీవితం పట్ల తనకున్న సానుభూతిని పరోక్షంగా వ్యక్తీకరించాడు.

ఈనవలలో హోరీరాం ఒకసామాన్య రైతు. గోవును భోలానుంచి ఎలాసంపాదించడమా అన్న సమస్యతో కథ ప్రారంభమౌతుంది. లౌకికుడైన హోరీరాం ఆవును తనకిచ్చేట్లుగా ఒప్పిస్తాడు. ఆవును తోలుకొచ్చేందుకు గోబర్ భోలాయిల్లు చేరుతాడు. ఇక్కడ గోవు కథ అంతర్ధానమైపోయి వితంతువు ఝునియా కథ ఆరంభమౌతుంది. ఇందులో ఒక విధవరాలును ఒక యువకుడు ప్రేమించి యిల్లాలుగా చేసుకొనబోవు విధానం చక్కగా చిత్రితమైంది. సంఘసంస్కరణలో ఒకభాగమైన వితంతువు వివాహాన్ని ప్రోత్సహించే నిమిత్తం ఈ పాత్రల కల్పన చేశాడేమో. గోబర్ ఒక చేత్తో ఆవు పలుపును మరోచేత్తో ఝునియా చేయి పుచ్చుకొని నడుస్తున్నాడు. ఆప్రథమస్పర్శలో వాళ్ళబంధం ముడిపడింది. వియోగానికి తావీయకుండా యిద్దరు సంయోగమైనారు.

శిస్తుచెల్లించే రోజుల్లో రైతులు పొందే బాధలు, శిస్తుకట్టేందుకు రైతులు చేసే యత్నాలూ ఇందు వివరిస్తుంటే, అవిరళ ప్రేమ్‌చంద్ గుండెలోతుల్ని తడవిమాపు తుంది. ఆషాఢమాసం చివరిలో ఒక పెద్ద వర్షం కురిసింది. రైతులు రెండోపంటకు సన్నాహాలు చేసుకొంటూంటే జమీం దారు నుండి పాతఅప్పులు చెల్లించక పోతే రెండోసాగు చేయడానికి వీల్లేదని ఉత్తర్వందింది. రైతుజనం కలవరపడ్డది. హోరీరాంకు అప్పులున్నందున మళ్ళీ అప్పు పుట్టదని విచారిస్తున్నాడు. చివరి ఝింగురసింగు వద్దకు వెళ్ళి దణ్ణంపెట్టి కష్టాలు చెప్పుకుంటాడు. ఆవును దక్కిం చుకోడాన్కి అవకాశ మిచ్చిందని సింగు అప్పుకంటె ఆవునమ్మివేస్తే నజరానాలు లేకుండా రొక్కం వస్తుందని అంటాడు. హోరీరాం అమ్మేందుకు మ సొప్పక ఇంటికెళ్ళి మాట్లాడి వచ్చి తర్వాత చెప్తానంటాడు.

పాపం ఆరాత్రే ఆవు చచ్చిపోతుంది. మునసబు రిపోర్టుమీద ఇన్‌స్పెక్టర్ వచ్చి ఎవరిమీద నీఅనుమానం అని హోరీరాంను అడుగుతాడు. ధనియా ఆవేశంతో హీరాయె మందు పెట్టిచంపాడంటు తమ్ముని గౌరవం కాపాడమని హోరీరా

శాస్త్రిని వేడుకుంటాడు. గ్రామపెద్దలంతా 30 రూ.లు లంచమిచ్చి పంపిద్దాం అని అవి సింగుకు అప్పుగా హోరికిచ్చేట్లుగా ఏర్పాటుచేస్తారు. సింగిచ్చిన డబ్బు తెచ్చి ఇన్‌స్పెక్టర్ వద్దకు చేరిన హోరిరాంను చూచి ధనియా 'ఆవు చచ్చింది చాల్లా ఇంకా ఈడబ్బుకూడా తగలెయ్యాడమెందుకు' అని గ్రాచులా లేచింది. 'మన కెవళ్ళూ అప్పిచ్చ్యానవసరం లేదు. కావాల్సినప్పుడు అప్పిచ్చే దాతలు కనబడలేదుగాని ఇప్పుడెక్కడి నుండి వచ్చిందో అంతా తెల్సునాకు, వాటాలేసు కుందామని యిచ్చారు. బీదాళ్ళ నెత్తురు తాగే వాళ్ళందరు ఊరి పెద్దలే' అని వాళ్ళనిజరూపాలు బయట పెట్టింది ధనియా. ఊరిపెద్దలు పెదవి కదపలేదు. ఇన్‌స్పెక్టర్ ముఖం ఎర్రబడింది.

రెండవభాగం కథ ప్రేమ్‌చంద్ సామాజిక స్పృహను సంఘ సంస్కరణను తెలియపరుస్తుంది. గోవర్ ఝునియాను వెంటపెట్టుకొని యింటికి బయలుదేరుతాడు. తాను చేసిన ఈపనికి తల్లిదండ్రులు తిట్టినా తర్వాత చేరదీస్తారు. కాని సంఘం ఊరుకోదుకదా! కులం కాని పిల్ల అందులో విధవరాలు, పైగా వట్టిమనిషి కాదు. ఇదంతా ఆలోచించేసరికి తలతిరిగింది గోవర్‌కు. ఝునియాను ముందు వెళ్ళమని తాను తర్వాత వస్తానంటాడు. ఇంట్లోకి చేరిన ఝునియాను చూచి ధనియా చివాట్లుపెట్టి గెంటేయబోయిందికాని చచ్చినా కదలనందామె. తర్వాత హోరి వచ్చి ఆప్యాయత చూపిస్తాడు. దీనితో కథ విచిత్రరూపం చూపిస్తుంది. విధవరాలును తెచ్చి యింట్లో పెట్టుకున్నారని ఊరిపెద్దలు హోరిరాంను వెలివేస్తారు. సంఘమర్యాద పాటించని వాళ్ళని, కాపాడని వాళ్లని, ఏం చెయ్యాలో సంఘానికి తెలుసు. వంద రూపాయిలు, ముప్పైమణుగుల ధాన్యం, తప్పవేశామని చెప్పేసింది పంచాయితి. అయినా హోరిరాం ఈవిషయంలో జంకలేదు. ఇంట్లోవున్న ధాన్యం యిమ్మన్నాగా యింకా 80 రూ.లు కట్టవల్సి ఉంటే ఇల్లు తాకట్టుపెట్టి అతప్పు పూర్తిగా చెల్లించుకుంటాడు. భోలా ఆవునిచ్చిన బాకియైన చెల్లించమంటాడు లేదా ఝునియాను యింట్లోనుండి వెళ్ళగొట్టమంటాడు కాని ఆయన రెండెడ్లనే వసూలు కుంటాడు పశువులు లేని కారణంగా పొలం శాస్త్రికి పాలిక్రింద యిచ్చివేసి కూలికి కుదురుతాడు హోరిరాం. ఈకూలి కూడా వెనుక ఎప్పుడో యిచ్చిన రూపాయల వడ్డీక్రింద చేయించుకుంటాడు. పొలంలో పనిచేస్తూ హోరిరాం స్పృహ తప్పిపడిపోతాడు. పూర్తిగా కోలుకోక ముందే పనికిరమ్మని శాస్త్రి బలవంత పెడ్తాడు. ఇది సహించక గోవర్ 'ఒక వంద అప్పివ్వడం, వడ్డీక్రింద బ్రతికినంత కాలం కూలీనాలీ లేకుండా చాకిరీ చేయించుకోవడము ఇది వడ్డీవ్యాపారమా? నెత్తురు తాగడంగాని' అని ఉద్రేకంతో లేచి 'ఇట్లాగే కదా మీరు రైతుల్ని దోచుకొని, చివరికి కూలాళ్ళని చేసేసింది? అప్పులుంటే చెల్లిస్తాంగాని నీకేమీ బానిసలం కాదంటాడు. శాస్త్రి వెళ్ళిపోతాడు.

శాస్త్రి వరిశిప్పు నూరుస్తున్నాడు. ఆతనిపుత్రుడు మాతాదీన్ ప్రేమించిన సిలియా (మాలది) ఆకళ్ళంలో పనిచేస్తుంటే ఆమె తల్లిదండ్రులు వచ్చి ఆమెను రమ్మంటారు. కాని ఆమె తను నమ్ముకున్న వారినీడనే వుంటానంటది. చివరికి మాలలు బ్రాహ్మణుడైన మాతాదీన్‌ను కులం చెరుస్తారు. మాతాదీన్ మాలలు చేసినపనికి కోపం తెచ్చుకొని సిలియాతో బంధాన్ని త్రెంచుకోచూస్తాడు. వెంటబడివస్తున్న సిలియాను రావద్దని త్రోసివేస్తాడు. అటుగా వచ్చిన హోరిరాం దంపతులు సిలియా దీనస్థితిచూచి ఆమెను చేరదీస్తారు. అస్పృశ్యతాభావం మానవతావాదియైన హోరిరాంకు లేదనే విషయం యిందులో రచయిత నొక్కి చెప్తాడు

సిలియాకొడుకు రాముడు రెండేళ్ళవాడవుతాడు. మాతాదీన్ బాలుణ్ణి లాలించాలని సిలియా యింటివైపు వస్తాడు కాని సంఘానికి వెఱచి వెనక్కి వెళ్తూంటాడు. రాముడు చనిపోయాడని తెల్సి మాతాదీన్ సంఘాన్ని కులాన్ని లెక్కచేయకుండా తన కొడుకును స్వయంగా తీసుకువెళ్ళి ఖననం చేస్తాడు. 'తనకర్తవ్యం పూర్తి చేసేవాడే బ్రాహ్మడు. చెయ్యనివాడు మాదిగ' అని సిలియా ననుసరించి ఆమె యింట్లోనే ఉండిపోతాడు మాతాదీన్.

చివరిభాగంలో సాంఘిక దురాచారాన్ని ఎత్తి చూపాలనే ఉద్దేశ్యంతో కథను మలుపుతిప్పాడు ప్రేమ్‌చంద్. మనిషి దురాచారానికి పాల్పడేందుకు గల పరిస్థితులు, వానివల్ల ఆత్మవిశ్వాసం కోల్పోయే విధానాన్ని ఆయన బాగా చిత్రించుతాడు. ఈదశలో హోరిరాం స్థితి చాలా అధ్వాన్నంగా నుంటుంది. నోఖెరాం బాకీచెల్లింపుకు హోరిరాంపై బేదఖలీ దావావేస్తాడు. పొలందక్కించుకోడానికి మార్గంలేక శాస్త్రి సలహా మీద తనంత వయస్సున్న రాంసేవక్‌నకు రూపా నిచ్చి పెళ్ళిచేయాలని నిశ్చయించుకుంటాడు. ఇది సాంఘిక నేరమౌతుంది కాని గత్యంతరం లేదు. జీవితంలో జరిగే సంఘటనల్లో అపజయమే పొందుతున్నాడు హోరిరాం. ఈకార్యంవల్ల పిల్లకు పెళ్ళి తనకు తాతలనాటి స్థిరాస్తి దక్కుతుంది. ముహూర్త నిశ్చయం, తర్వాత పెళ్లికూడా అయిపోయింది. తగిన వయసుగలవాడు కాకున్నా ఆతనిని వివాహమాడింది కేవలం తల్లిదండ్రుల స్వార్థమే.

ఆవును కొనాలను కోరిక మెండై గోడ్డు వేసేపనిలో కూలికి కుదురుతాడు. పనిలో ఒకనాడు చేతగాక చెట్టుక్రింద నడుం వాలుస్తాడు. తలంతా తిరుగుతూండడం వాంతిచేసుకోవడం ప్రారంభమైంది. ఇంతలో ఇంటికి కబురందగానే ధనియా వస్తుంది. ధనియాతో 'బ్రతికుండగా ఆవుని కొనుక్కోలేకపోయాను... ఏడవబోకు ధనియా' అంటూండగా కళ్ళు మూతలుపడినాయి. కొన ఊపిరితో ఇల్లు చేర్చుతారు. గోదానం చేయించాలి. ఇంట్లో ఆవులేదు. ఇంట్లోవున్న రూపాయి పావలాయే ఆయనగోదానంగా చేయించుతారు.

ఈనవలలో జమీందార్ల అధికారాలు, పెత్తందార్ల అత్యాచారాలూ విపులంగా వివరించబడ్డాయి. అసలు న్యాయం, ధర్మం వారిలోనున్నట్లు కనిపించనే కనిపించదు. దయాదాక్షిణ్యాలం లేనికసాయి వారుగా కనిపిస్తారు. వీళ్ళకు నీతంటూ లేకుండాపోయింది. వెట్టిచాకిరీ చేయించుకుంటారు, లంచాలు తీసుకుంటారు. ఏదో మడత పేచీపెట్టి డబ్బులు గుంజుతుంటారు అయినా వీళ్ళదాహం తీరదు. వీళ్ళు అప్పిచ్చి వడ్డీక్రింద చాకిరీచేయించుకొని చివరికి స్థిరాస్తులు కాజేసి రైతులను కూలీలుగానే చేసి భూములకు కామందులై కూర్చుంటారు. అంతేకాదు. ఈ నవలలో హోరిరాం, ధనియావంటి బీద రైతులలో న్యాయం, దయ ఏవిధంగా చోటుచేసుకొన్నాయో స్పష్టంగా కనబడుతుంది. అన్యాయంగా సంఘం కట్టుబాట్లంటూ హోరిరాం మీద జుల్మానా వేసిన గ్రామపెద్దలను, అక్రమంగా దావా వేసి డిక్రీపొంది పంటంతా కైవసం చేసుకున్న మంగ్రూ సావుకారు, బెదఖలీదావా వేసి డబ్బురాబట్టుకొన్న నొఖెరాంలను వారి అవినీతిని ఎత్తిచూపాడు ప్రేమ్ చంద్. కులమతాల అడ్డుగోడలు కూలి ఝునియాను హోరిరాం చేరదీయడం, సిలియాయింటికే వెళ్ళి బ్రాహ్మణత్వాన్నే మాతాదీన్ త్యజించడంవంటి విషయాలు అందరికీ సమ్మతమయ్యేట్లుగా చిత్రించాడు. భారత నారికి సాహిత్యంలో సముచిత మైనస్థానం కల్పించారు ప్రేమ్ చంద్. ఈనవలలో ప్రజాజీవితాలను ప్రతిబింబించే వాస్తవిక సమస్యలను తీసుకొని పాఠకుల మనఃఫలకాలపై అద్దుకునేట్లుగా వ్రాశారాయన. ఆయన వ్రాసిన నవలల్లో మకుటంలాంటి దిది.

—•••—

## మార్పు - తీర్పు

కవికోకిల శ్రీ మామిండ్ల రామగౌడు.



* దొడ్డదొర నడువగనె
గ్రుడ్డిగా నమ్మచును
తలవంచుకొని వినెడు
తరుణ మేగగ వలెను.

* ప్రజలెల్ల యోచించి
నిజ మేదొ గ్రహియించి
మంచి చెడ్డలను విభ
జించి చూడగ వలెను

* ప్రజలను ప్రభుత్వమ్ము
పాలు నీరు విధమ్ము
కలసి మెలసియుండు
కాలమ్ము రావలెను.

* నిప్పుతో చెర్లాడి
నీలిగెడు శలభాల
భంగి వంచకులు భువి
పతనమ్ము గావలెను.

* ఉద్యోగి సోదరుల్
ఉన్నతాభ్యుదయముల
కర్తవ్య పాలనన్
గడగి నడువగ వలెను.

* విద్యార్థి రత్నముల్
వినయ గుణ భరితులై
చదువు సంజలతోడ
సాగుచుండగ వలెను.

* కర్షకుల్, కార్మికుల్
కష్టజీవులు, శ్రమకు
ఫలితాల నొందుచును
పరవశించగ వలెను.

* ధరల నదుపున బెట్టి
కరువుల విసరికొట్టి
వ్యాపార కోవిదులు
వరలుచుండగ వలెను.

* మోసాన, తిన్నింటి
వాసాలు లెక్కించు
విశ్వాస ఘాతుకుల
పిచ్చి కుదిరించవలె.

* నక్క వినయాలు గల
నాయకమ్మన్యుల
మేక వన్నెల పులుల
తోకలను గోయవలె.

* ప్రక్కలో బల్లెములు
టక్కరులు, నట్టేట
పుట్టి ముంచెడు నరుల
జుట్టు పట్టీడ్వవలె.

* 'పెద్దమనుషు'ల మంచ
గద్దెపైనెక్కి బల్
గద్దతీ పనుల్ చేయు
గ్రద్దలను దరుమవలె.

* పరసతీ విత్తాప
హరణ మొనరించి, రా
క్షస కృత్యముల సల్పు
కాముకుల చెండవలె.

* బడుగు బ్రతుకులలోన
బడబాగ్నులను జిమ్ము
నడమంతరపు దొరల
నడతలను మార్చవలె.

* రాజకీయ మటంచు
రంగులను పులుముకొని
పేదలను బెదరించు
వెంగళుల గదుమ వలె

* జాతిలో చేతన
జ్యోతులను వెలిగించి
నీతిజ్ఞులై ప్రజలు
నిలువ వలె ధైర్యమున

—•••—

# అన్నమయ్య సంకీర్తనములు - శృంగార రసపోషణము

- శ్రీ ఎ. క్రిష్ణప్ప. ఎం. ఏ; బి. ఎస్‌సి

ఆంధ్ర వాగ్గేయకారులలో నాద్యుడు, పదకవితా పితామహుడు సంకీర్తనాచార్యుడు, సాళువ నరసింహరాయని సమకాలికుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు. అన్నమయ్య ఆంధ్రములో శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనములు, శృంగార మంజరి, పంౘ్రెండు శతకములు, ద్విపద రామాయణము, వేంకటాచల మాహాత్మ్యము, సంస్కృతములో సంకీర్తన లక్షణము రచించె నని చిన్నన్న తన అన్నమాచార్యుని చరిత్రములో తెలిపెను.

సంకీర్తన వాఙ్మయమును తొలుత సృష్టించినవాడు అన్నమయ్య. సర్వేశ్వరున కంకితమై కీర్తింపబడిన పదములు సంకీర్తనములు. పదములే అన్నమయ్య నాటికి సంకీర్తనములుగా పరిగణింపబడినవి. అన్నమయ్య సంకీర్తనములలో వస్తువు భగవద్విషయము. భగవంతునిపై గల భక్తి, మతప్రచారముపైఁగల మమత సంకీర్తనల రచనకు దారితీసినవి. అన్నమయ్య శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనములు రచించి, తిరువేంగళనాథుని కంకితము గావించి కీర్తించి తరించెను.

అన్నమయ్య రచనలలో శృంగార సంకీర్తనములే మిన్నగ నున్నవి. ఈతని శృంగార సంకీర్తనములలో శృంగారము రసవత్తరముగ, ఔచిత్యానుసారముగ పరిపోషింపబడినది. శృంగారము సర్వజనులకు ప్రియమైనది. అన్నమయ్య వేంకటేశ్వరస్వామి వరప్రసాదుడు గనుక ఈతనికి స్వామిపై గల భక్తి పెరిగి, వెల్లువికి శృంగారముగా మారియుండును. 'కామిగాక మోక్షగామి గాడు' అను సూక్తి యుండనే యున్నది. కాబట్టి శృంగారమే భక్తికి మార్గమై మోక్షమును ఇవ్వఁగలదనుట నిర్వివాదాంశము. అన్నమయ్యే శృంగార పరమార్థమును గూర్చి "ఇదిగాక సౌభాగ్య మిదిగాక తపము మఱి యిదిగాక వైభవం బిక నొకటి గలదా" యనియు "అదిగాక సౌభాగ్య మదిగాక వలపు అదిగాక సుఖమిక నందరికి వలదా !" యనియు వివరించెను.

రస మనగా నానందము. దశరూపక కర్తయైన ధనంజయుడు "విభావై రనుభావై శ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః, ఆనీయమానః స్వాదుత్వం స్థాయీభావో రస స్మృతః" అని రసమును గూర్చి తెలిపెను. విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావముల చేత ననుభవింపబడిన స్థాయి భావమే రసమగును. స్థాయి అనగా నిలుకడగా హృదయములో నిల్చియుండునది. నవరసములలో శృంగారము తలమానికము. శృంగారమునకు రతి స్థాయీభావము. నాయికా నాయకుల హృదయములఁ బుట్టు సంభోగవిషయసంబంధమగు కోరికకు రతి యని పేరు. హృదయముల నున్న స్థాయీభావముల నంకురరూపమున నాస్వాద్యమానములుగా నొనర్చునవి విభావములు. నాయికా నాయకులయందు పుట్టిన స్థాయీభావములను పైకి తెల్పుటయే అనుభావములు. రసానుకూలముగ ఇచ్ఛలేకుండ స్వతంత్రముగా నుత్పన్నమగునవి సాత్త్వికభావములు. రసవ్యక్తికి తోడ్పడు భావములు వ్యభిచారి భావములు. భోజుడు శృంగారముననే సర్వరసభావములును లీనమై యుండు నని తెల్పెను. శృంగారరసము సంభోగ విప్రలంభ శృంగారము లని రెండు విధములు. సంభోగశృంగారము సురత రూపముననే గాక పరస్పర దర్శనాలింగన, చుంబన, వన జల విహారాద్యనంత రూపములుగా నుండును. విప్రలంభ మనగా వియోగము. విప్రలంభము అభిలాష, మాన, విరహ, ప్రవాసము లని నాల్గు విధములు. సంభోగమునకుఁ బూర్వము కలుగు ప్రేమ అభిలాష. కారణరహితముగ నాయికా నాయకులకు కలుగు కోపము మానము. కారణసహితముగ నాయికా నాయకులు విడిపోవుట విరహము. కార్యనిమిత్తము దేశాటనము పోవుటచే నాయికానాయకుల కలయికకు నవరోధము కలుగుట ప్రవాసము.

పైని వివరించిన శృంగారలక్షణాలన్ని అన్నమయ్య శృంగార సంకీర్తనములలో చోటుచేసికొన్నవి. ఈతని కీర్తనములలో అనుభావ, సాత్త్విక, వ్యభిచారభావము లెక్కువ; విభావములు తక్కువ. అన్నమయ్య ప్రతి శృంగార సంకీర్తనము శృంగారరస సాగర తరంగము. అన్నమయ్య అనేక నాయికా పాత్రలలో లీనమై శ్రీవేంకటేశ్వరస్వామిని నాయకుడుగా తలంచి, శృంగారచేష్ట లనుభవించి, విడిపోయినప్పుడు విరహమును బొంది, తన్మయత్వము నొందెను.

అన్నమయ్య పదములు హృద్యములు, మృదుమధుర పదయుతములు. అన్నమయ్య సంకీర్తనములలో సంభోగ శృంగారము కేవలం సురతరూపముననే గాక పరస్పర దర్శన, ఆలింగన, చుంబన రూపములుగా వర్ణింపబడినది. సురత - సంభోగ శృంగార మనోహార వర్ణనము క్రింది సంకీర్తనమున చూడనగును.

"లలిత లావణ్య విలాసముతోడ
నెలత ధన్యతగలిగె నేటితోడ ॥పల్లవి॥
కుప్పలుగా మైనసలుకొన్న కస్తూరితోడ
తొప్పఁదోగేటి (గడి?) చెమటతోడ
అప్పడటు శశిరేఖలైన చనుగవతోడ
దప్పిదేరేటి (రెడి?) మోముఁ దమ్మితోడ
॥లలిత॥

కలువం గబరీభరము కుంతలంబులతోడ
తొలగఁదోయని ప్రేమతోడ
మొలకనవ్వులుదొలకు ముద్దుజూపులతోడ
పులకలు పొడమైన పొలుపుతోడ ॥లలిత॥
తిరువేంకటాచలాధిపుని మన్ననతోడ
సరిలేని దివ్యవాసనలతోడ
పరికించరాని అరవిరిభావముతోడ
సిరిదొల (లం?) కెడి చిన్ని సిగ్గుతోడ"_
॥లలిత॥

— 12 సంపు 130 సంకీ.

పై సంకీర్తనములో నాయికా నాయకుల పరస్పర ఆలింగనము, కచగ్రహణాదు లగు శృంగార చేష్టలతో నాయిక తృప్తినొందినది. సంభోగానంతరము సంతృప్తినొందిన స్త్రీ చేష్ట లిందు వర్ణింపబడినవి. ఇట్లే

"ఏ మెంకో చిగురు టధరమున
యెడనెడ గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన
పత్రిక కాదుగదా"

సంకీర్తనములోను సంభోగ శృంగారము వర్ణింపబడినది. సంభోగ శృంగారమును పరస్పర దర్శన రూపమున

"ఆత డేపో చెలియా మాయాతడు చేతనే పరముచూపి (పీ) చెలువైన యాతడు"

సంకీర్తనములో వర్ణించినాడు అన్నమయ్య.

అన్నమయ్య సంకీర్తనములలో నిర్మల ప్రేమసైత మతిమనోహరముగ నభివర్ణింపబడినది. కలలోకూడ నలిగి దూర ముండుట భరింపని నాయిక ఈ విధముగ అంటున్నది.

"కలలోనె యిరువురము నలిగి వేగ
కలయనుచుం దెలిసి నిను
గౌగిలించితిరా ॥పల్లవి॥
అలుగుదురెం బతులనగా వినగ
నలవాటు లేక నే నలుగుచుండుదురా
అలిగి తట పురక నీవంత నాతోను మరి
నలుగుతానట పూవులంతలోపల నే ॥కల॥
చందురుడె సూర్యుడె జగమిరుల
కెందమ్ములపుర నా కెంగేలుదోయి
గంద మే తోచెనట కస్తూరి యవగ నా -
చందమపు డొకలాగు చందమవు నటరా
॥కల॥
విటవరుడ శ్రీవేంకటే విభుడ నీ -
వెటుదొలంగిన దేహ మెట్టు నిలుపుదురా
యిటువలెనా మనలోన నెలమి మరచి
తటుకనను గలయనుచు తలకి తెలిసితిరా
॥కల॥

— 12 సంపు. 21 సంకీ.

ఇంతకన్న నిర్మలప్రేమ ఎక్కడ గలదు. నాయకుడు భవిష్యద్విరహము భరింపనని "విరహాన నినుబాసి వేగేను తరుణి నేను నిన్నుదప్పు దోయగలనా" తెలుపుటయు నాయకునికి నాయికపై నున్న నిర్మలప్రేమ వ్యక్తమగుచున్నది.

అన్నమయ్య సంకీర్తనములలో నాల్గు విధముల విప్రలంభ శృంగారము వర్ణింపబడినది. అభిలాష, మాన, విరహ, ప్రవాసములలో అన్నమయ్య విరహ విప్రలంభమునకే అధిక ప్రాధాన్యము నిచ్చినాడు. విరహ విప్రలంభ శృంగార వర్ణనమునకు ఈక్రింది సంకీర్తనము చూడ వలయును.

"చెలియకు విరహపువేదన
సేయని సింగారంబిది
సొలపక వలపుల ముద్రల
చొప్పులు మాపకుడీ ॥పల్లవి॥
కిక్కిరిసిన చనుగుబ్బలు
గీటిన బగిలెడి నయ్యో
పక్కన గనుకలి దాకీ బయ్యెద దెరవకుడీ
వెక్కసమగు ముఖకాంతికి
వెడవెడ మరుగై తోచెడి
చెక్కుల చెమటలం గందెడి
చేతులు వెట్టకుడీ ॥చెలియ॥
అంగన మేనికి బులకలు అడ్డము
దోచెడి నయ్యో
బంగరు మొలకల వంటివి
పైపై దుమకుడీ
తొంగలి రెప్పల కెలకుల
తొరిగెడు కన్నుల మెరుగుల
ముంగిట వేసిన చూపుల
మురిపెము మానుపుడీ ॥చెలియ॥
తిరువేంకటపతి నింతికి
దెచ్చెద మనగా నయ్యో
కరుణించినవా డాతడె కళవళ మందకుడీ
తరుణీమణి మాదేవుని
దగగౌగిట సౌఖ్యంబుల
పరవశ మందినదేమో
పలుమరు బిలువకుడీ. ॥చెలియ॥'

—12 సంపు. 80 సంకీ.

విరహమున నున్నప్పుడు క్రిక్కిరిసిన చనుగుబ్బలు, చెక్కుల చెమటలు, అంగన మేనికి పులకలు, చూపుల మురిపెము, కలుగుట సహజములు. సహజ వర్ణనములలో రమణీయముగ వర్ణించుటలో నీతని కీతడే సాటి. విరహవర్ణన చేయుటలో ప్రబంధ కవులను సైతము మించినా డన వచ్చును. ఇట్లే 'కానచూపులనె వింత కోరికలు దైవార పెనగొన్న తమకమున బెనగుచున్నదురా' సంకీర్తనములో అభిలాష వియోగ శృంగారము, 'వద్దువోరా నీవు గడుకచ్చి తమవాయనేరు నిద్దుర పుచ్చేవునేమొ నీ కొలది వారమా' సంకీర్తనములో మానవియోగ శృంగారము, 'ఎందరికి మోహించి యెందువోతివో నీ యందపు జేతల నాతో నావలెయ్యరాదా, సంకీర్తనములో ప్రవాసయోగ శృంగారము, వర్ణితములు. అన్నమయ్య కొన్నిచోట్ల ఒకే సంకీర్తనములో విరహ సంయోగ శృంగారముల రెండింటిని వర్ణించినాడు.

'విరహమె సంభోగంబుల
వేడుక శృంగారమె యిది
సరసిజముఖి గని ప్రాణము
జల్లన గలగెడినే'

అను సంకీర్తనము ఇందుల కుదాహరణము.

అన్నమయ్య సంకీర్తనములలో లోతైన శృంగార భావములను సైతము పొందుపరిచినాడు.

'సొంపుల నీ వదనపు సోమశిల కనుమ
యింపులెల్ల జేకొనగ నిల్లు నీపతికి ॥పల్లవి॥

కలికి నీపిఱుదనే గద్దె రాతి కనుమ
వెంలనూళ్ళలత అనే ముంచుకొన్నది
కలయబోక ముడినే కట్టువడ్డది
అలరు విలుతు దాడికడ్డము నీపతికి
॥సొంపు॥

ఇదివో నీ కెమ్మోవి యెఱ్ఱశిలకనుమ
కదిసి లేజిగురుల గప్పుకొన్నది
వదల కింతవు దలవాకిలైనది
మదనుని దారికి మాటువో నీ పతికి
॥సొంపు॥

కాంత నీ చిత్తమే దొంగలసాని కనుమ
యింతటి వేంకటపతి కిరవైనది
పంతపు నీ గుబ్బలే గుబ్బలి కొండకనుమ
మంతనాల కనుమాయె మగువ నీ పతికి
॥సొంపు॥

—12 సంపు. 115 సంకీ.

పై సంకీర్తనములో పైకి కనిపించునవి కనుమలు మాత్రమే. ఇందులో లోతైన భావములు దాగియున్నవి. స్త్రీ వదనమును సోమశిల కనుమతో, పిఱుదును గద్దెరాతి కనుమతో, కెమ్మోవిని ఎఱ్ఱశిల కనుమతో, గుబ్బలను గుబ్బలకొండ కనుమతో పోల్చి వర్ణించినాడు అన్నమయ్య. సోమునితో వదనమును బోల్చుట వలన ముఖము కాంతివంతమైనదనియు, ఎఱ్ఱశిలతో పెదవిని బోల్చుటవలన మెత్తనైనదనియు (ఎరుపురాయి మెతువు) మనస్సును దొంగలసాని కనుమతో బోల్చుట వలన మనస్సు దొంగదనియు, చంచలమైనదనియు; స్తనములను గుబ్బల కొండకనుమతో బోల్చుటవలన స్తనముల ఔన్నత్యముగలదనియు స్పష్టము. ఈ భావమును శృంగార రసజ్ఞులు ఎఱుంగుదురు. ఇంతకంటె శృంగార వర్ణనము వేరొకటి గలదా! ఇట్లే అన్నమయ్య స్త్రీ అంగములను మేషాది రాశులతోను, శంఖిణ్యాది జాతులతోను బోల్చి శృంగార రస పోషణలో మేటి అనిపించుకొన్నాడు.

ఈ విధముగ అన్నమయ్య మధుర మంజులమైన సంకీర్తనములతో, యోగ వైరాగ్యములతో స్వామిని కీర్తించి, తరించి, జన బాహుళ్యము సైతము కీర్తించునట్లు చేసి తాను తరించి తరింపజేసెను.

—...—

## 'అభినవ రామకృష్ణ' అద్దేపల్లివారి కవితాహాసము

# "ఋతు విలాసము"

- శ్రీ డా. జి. బి. ఎన్. ఆచార్య, ఎం.ఏ., పి.హెచ్.డి.

ఆధునిక సాహిత్యారామమునందనేక మధుర రసకావ్య ఫలాలను పండించిన 'అభినవ రామకృష్ణ' బిరుదాంచితులు శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి గారు రసజ్ఞ సాహితీ లోకానికి సుపరిచితులు. వీరి సుకవితా హాసమే ఈ 'ఋతు విలాసము'. మహాకవి కాళిదాసకృత 'ఋతుసంహారము' నకు ఆంధ్రీకరణాలే కాక స్వతంత్ర ప్రతిపత్తితో, తద్భావ ప్రచోదితాలైన సుందర సుకుమార సంశోభిత ఖండకావ్య ప్రసూనాలెన్నో ప్రకృతి మాత పాదాలకు ప్రసూనాలుగా సమర్పించబడినాయి. ఇంకా సమర్పించబడుతూనే వున్నాయి. అందు అద్దేపల్లి వారి ఋతు విలాసకావ్య సుమసౌందర్యం సాహితీ లోకాన్ని సమ్మోహ సంభరితం చేస్తున్నది.

కావ్యాన్ని శ్రవ్యమనీ, దృశ్యమనీ విభజించినట్లుగానే, కవిత్వాన్ని వర్ణకమనీ, వస్తువనీ విభజించవచ్చు. వర్ణకమంటే సంఘటనా చిత్రణం. వస్తువంటే నిరపేక్షమైన బహుసంఘటనా ప్రబంధం. 'వస్తుకవిత దండయైనచో వర్ణక కవిత పువ్వువంటిది.'[1] కాబట్టి వస్తుకవితలో వర్ణక కవితకూడా వుండవచ్చు.

వస్తుకవిత నియతమైన ప్రీతితోపాటు, నిర్దిష్టమైన ప్రయోజనాన్ని కూడా అందిస్తుంది. పూర్వాంధ్ర కావ్యాల్లో అంతర్గతంగా వర్ణనాత్మకంగానే వున్న ఋతుషట్క శోభ నవ్య కావ్యాల్లో ప్రత్యేకంగా వస్తునిర్దేశం కలిగి వర్ణనాత్మకమై విలసిల్లుతూ వున్నది.

అనంత గంభీరమైన కాలమూర్తి అంగాలే షడృతువులు. వీటి ప్రభావం చేత ప్రకృతి విభిన్న రూపాలను ధరించి, సహృదయ నేత్రపర్వ సౌందర్య విలాసాలను వెలువరిస్తూ వుంటుంది. 'ద్వౌ ద్వౌ మాఘాది మాసౌ స్యాదృతుః' మాఘము మొదలైన రెండేసి మాసములు ఋతువనబడును. ఇయ్యది రీతి ఋతుః. ఋగతౌ గతించునది.[2] అంటే ఋతు ధర్మాలు మారుతూ వుంటాయి. మారుతున్న ఋతు ధర్మాలన్నీ ప్రతిభాన్వితులైన కవి చంద్రుల వర్ణన పాటవానికి విషయాలై వారి కవితకు అపూర్వమైన వన్నెను చేకూరుస్తూ వుంటాయి. ఈ రహస్యాన్నెరిగిన నవ్యకవులు షడృతువులను గంభీరభావాలతో వర్ణించి ప్రత్యేకంగా ఖండకావ్యాలను సంతరిస్తూ వున్నారు. సత్సంప్రదాయ కవితాముద్ర కలిగిన అద్దేపల్లి వారు కూడా ఋతువర్ణనలను చేపట్టటం సముంజసమూ, సమున్నతమూ అయివున్నది.

ఋతువిలాస కావ్యంలో ఏడు భాగాలున్నాయి. మొదటి ఆరూ ఆరు ఋతువులకు సంబంధించియుండగా, ఏడవది ఆరు ఋతువులను సాముదాయికంగా వర్ణించిన 'ఋతుషట్క విలాసము'నకు సంబంధించి వున్నది. ఈ కావ్య మందలి చివరి

పద్యాలలో ఋతుషట్కమునందలి సంవత్సరైక్య దృష్టిని వెలయించినారు. సంవత్సరమే ఒక పురుషుడు. ఈ భావం వేదమందు గలదని అభిజ్ఞుల అభిభాషణం. దానిని వీరు విస్పష్టపరచినారు. ఆధునికంగా ఋతువులను గూర్చి కావ్యాలను వ్రాసిన ఇతర కవులెవ్వరూ ఈ విషయాన్ని ప్రస్తావించియుండలేదని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి అభిప్రాయం.[3] కాబట్టి ఈ కావ్యం మిగిలిన కావ్యాలకంటె విలక్షణమైనదని నిర్ణయించవచ్చు.

ఈ కావ్యమందలి మొదటి ఖండిక 'వసంతము'. ఇందులో 'వసంతలక్ష్మీ మాధవుల' కల్యాణం కనుల పండువుగా వర్ణించబడింది. బహుశః కవిగారు లక్ష్మీనారాయణుల కల్యాణాన్ని దృష్టియందుంచుకొన్నారని చెప్పవచ్చు. 'సుష్ఠు రథంతే ఉపక్రమంతే శుభకార్యం కర్తుమితి సురభిః'[4] దీని యందు జనులు శుభకార్యము జేయనారంభింతురు. అని వసంతఋతు లక్షణం చెప్పబడింది. దీని కనుగుణంగా కవిగారు వసంతలక్ష్మీ మాధవుల కల్యాణంతో వసంత ఋతువును ప్రారంభించడం సముచితంగా వుంది.

'చలువ వెదజల్లుమావి పందిళులయందు
జడలు మేల్కట్టు పైని మున్నటనుగొల్పు
తలిరుటాకుల తోరణంబులను గట్టి
పూల జముకాణ బఱచిరి నేలయెల్ల'

ఈ విధంగా సుమనోజ్ఞంగా అలంకరించబడిన నేలనడుమ కల్యాణ వేదిక నయనపర్వంగా శోభిల్లుతున్నది. ముత్తైదువులు, బంధువులు, పండితులు, మేళగాళ్లు ఇంకా తదితరులయిన పెద్దలు ఆసీనులై వున్నారు. అంతట పూనెలతలు వసంతలక్ష్మిని నయన మనోహరంగా అలంకరించి, వివాహవేదిక మీది పీటపై కూర్చుండబెట్టినారు. వరుడు మాధవుడు ముందే కూర్చునియున్నాడు. వసంతలక్ష్మీ వైభవాన్ని కవిగారీవిధంగా వర్ణించారు.

'కన్య యొప్పులకుప్ప, లావణ్యరాశి,
తళుకులీనెడు మోము పద్మంబు, నిటల
మర్ధచంద్రుడు, ముంగురు లళులు, బొమ్మ
లలరు విలుకాని చెఱకు వింటిలక్ష్మి యగు
తెల్లతామర రేకలు, పల్లు వరుస
మల్లెపూజాలు, కెమ్మోవి పల్లవంబు,
హస్తములు తమ్మితూండ్లు ప్రశస్తములగు
నూరువు లనంటు, లంఘ్రులు నీరజములు
పలుకు తేనియ, కోకిల స్వరము స్వరము,
హాస మంచిత పుష్పవికాస; మటకు
వరుడు మాధవుడును మున్నె
వచ్చియుండె;'

ఈ సుదీర్ఘ వర్ణన సుమనోజ్ఞంగా ప్రబంధవర్ణనను తలపిస్తున్నది. ఈ పద్యంలో పూర్వకవుల ప్రయోగ వైఖరులు తొంగి చూస్తున్నాయి.[5] అంగాంగ వర్ణనలకు ప్రబంధకవులు మిక్కిలి ప్రాధాన్యమిచ్చారు. అట్లే వీరు కూడా వసంతలక్ష్మిని సర్వాంగీణముగా వర్ణించారు. ప్రకృతిని మానవీకరించి, దృశ్య సాక్షాత్కారాన్ని కలిగించిన కవిగారి నేర్పు ప్రశంసనీయం. గ్రహించిన ఉపమలు, సంధించిన రూపకములు ఔచితీమంతములును, సుశ్రీమంతములును, అయి వున్నవి. ఇందులోని శబ్దాలన్నీ నవమృదుల పల్లవసదృశాలు. భావసాంకల్యానికి, భాషానైర్మల్యానికి కవిగారువారసు లనే విషయాన్ని పైపద్యాలు నిరూపిస్తున్నాయి.

'సమయయాజ్ఞికుండవిరళోత్సాహ మొప్ప
నిఖిల పరిణయవిధులను నేర్పుమీఱ
నిర్వహించుచు నెలమిమై నెలతయందు
దాళిబొట్టును గట్టించె లీల మెఱయ,'

సమయయాజ్ఞికుడు శాస్త్రోక్తంగా వివాహాన్ని జరిపించాడని సంప్రదాయసిద్ధంగా వర్ణించారు. 'నిఖిల పరిణయ విధులను' అనటంచేత, మనసంప్రదాయానికి చెందిన సమస్తవిధాలను అని ధ్వనింపజేసారు. భారతీయ సంప్రదాయాలలో 'కల్యాణము' విశిష్టమైనది. అందులోను 'తెలుగు' వారి పరిణయవిధులు విలక్షణమైనవి.

నిక్కమైన తెలుగుకవులు ఈసంప్రదాయాలన్నింటిని వర్ణించి తమ సంప్రదాయాభిజ్ఞతను చాటుకొనుటకు ప్రయత్నించారు. కవిగారు ఈ కావ్యంలో వివాహసంరంభాలను విపులంగా వర్ణించారు. తలంబ్రాలను బోయించటం, దండలను మార్పించటం, బ్రాహ్మణాశీర్వాదాల నిప్పించటం, సభ్యులందరికీ అత్తరు, పన్నీరులను జల్లించి, గంధాన్ని పూయించటం, ఫలాలను, తాంబూలాలను పెట్టి సన్మానింపజేయటం మొదలైన విశేషాల నెన్నింటినో కవిగారు మఱవక పూసగుచ్చినట్లు వర్ణించారు.

'ప్రీతిమై బెండ్లికై కోరి పెట్టినట్టి
ఆవకాయయు,మాగాయ, అప్పడములు,
వడియములు నింకెన్నియో వంటకములు
భాజనములందు జుట్టును వైచినారు.'

తెలుగువారికి సంబంధించినవీ, వివాహాల్లో వినియోగించేవీ, అయిన పదార్థాలను పైపద్యంలో 'చవు' లూరించేట్లుగా వర్ణించారు. 'పూవెలందులు మడిగట్టి వడ్డన చేసారని చెప్పటంచేత కవిగారికి గల శ్రోత్రియాచారప్రీతి వ్యక్తమవుతున్నది.

---

* మూడు దేవాలయములలో చాల అక్రమములు జరగుచున్నందుకు నిరసనము.
- రాజమండ్రి వార్త

* ఆ మూడును మినహాయించి మిగిలిన అన్ని అక్రమరహితంగా నడచుచున్నందుకు ప్రశంసించుట సౌజన్య లక్షణ మగునుగదా.

'గానగంధర్వ బిరుదంబు నూనినట్టి
సరససారంగ గాయక సార్వభౌముఁ
గోరిపిలిపించి పాటకచేరి పెట్టి
రెల్లవారలు మనముల నుల్లసిల్ల !'

అని భోజనానంతర కార్యక్రమాన్ని వివరించారు. విసుగులేక విన్నపాటనే మళ్ళీ వినిపించుకొని పెండ్లివారందరూ మిక్కిలి ఆనందాన్ని పొందారని వర్ణించి, సాధారణంగా పెండ్లిండ్లలో జరిగేవినోద కార్యక్రమాలను జ్ఞప్తికి తెచ్చారు. 'సరస సారంగ గాయక సార్వభౌముడు' అనటంలో ఒకవిశేషం వుంది. వసంతఋతువులో పుష్పమకరందాన్ని తనివిదీర గ్రోలి తుమ్మెదలు చిత్రవిచిత్ర ఝుంకారాలు చేస్తాయి. 'ఝుంకారము' గుణ మాధారంగా తుమ్మెదకు గాయకనామం ఆపాదించబడింది. అందులోను కవిగారు 'సార్వభౌము' డనటం మిక్కిలి విశిష్టంగా వుంది.

'అయిదుదినముల పెండిలి యన్నమాటె
కాని రెన్నెల్లబందుగుల్ కడుపునిండ
భోజనము సేసి క్రొత్తపో పుట్టములను
కట్టుకొని నున్నపడినారు కల్లగాదు.'

అని మనలో 'అయిదుదినముల పెండ్లి చేసే ఆచారంకూడా వుందని తెలియజేశారు. దీని ప్రాచుర్య మిప్పుడు తగ్గినట్లు గమనించాలి. నూతన వస్త్రాలను పెట్టే ఆచారంమాత్రం ఇప్పుడూ అవిరళంగానే వున్నది. 'రెన్నెల్లు బందుగుల్ కడుపునిండ భోజనముసేసి' అని వర్ణించటంలో చైత్రవైశాఖమాసాలు రెండూ వసంతఋతువుకు సంబంధించినవే అని స్ఫురింపచేసారు.

ఈవిధంగా కవిగారు 'వసంతలక్ష్మీ మాధవుల' కల్యాణాన్ని వర్ణించేవ్యాజంతో తెలుగువారి పెండ్లి సందడిని తనివిదీర వర్ణించి తమ ఆంధ్రత్వాన్ని నిరూపించుకున్నారు.

'పెండ్లిసందడిలోనఁ బూవిల్తుఁగూడి
వలపుమోపరితుంట పూవెలఁదుకలను
వరుసఁ గదలించి చూచి లాభంబు లేక
చల్లగా సాఁగిపోయె నెచ్చటికో యెరుల
కంటఁబడకుండ, ఆ మొగ్గకన్నెపిండు
కామవశతను దిరుగు మలీమసాళిఁ
జెంతఁ గని మూతులన్ మోడ్చి
స్వాంత మందు
కోసి కనువిప్పి చూడదు దోసమనుచు.'

అని రసవత్తరంగా వసంత ఋతు నిష్క్రమణాన్ని చమత్కరించారు. ఈ ఖండికలో ఇంకా 'స్మరశరము', 'మధుమాసము', 'చిగురుఁబోగరు', 'షట్పదము' 'వసంతుడా!', 'వసంతనామ సార్థక్యము' అనేభాగాలున్నాయి. 'గాలితేరు, చిల్కల వాహనములు, మీ.పతాకము, బంభర మౌర్వి', మొదలైన శబ్దచిత్రాలుమనోజ్ఞంగా వున్నాయి. వేపపూవు పచ్చడిని 'అచ్చపు వేల్పుబువ్వ'తో పోల్చటం మిక్కిలి వుదాత్తంగావుంది. ఇంకా అనేక విధాలుగా వసంతుణ్ణి కొనియాడుతూ, స్వాగత గీతాలను ఆలపించారు. 'శ్రీ వసంత !' అను సంబోధనలోని 'శ్రీ', అనే అక్షరం అక్షయమైన వసంతసౌభాగ్యాన్ని తెలియజేస్తున్నది.

'అరుణకారుణ పల్లవ వి
స్ఫురదురుతర నవలతాంత సుషమాసంప
ద్గరిమవసంతం బని యం
దురు నా కది సార్థకముగఁ
దోఁచును మదిలో !
ధరవర్ణవ్యత్యయమున
మరకత మగు మకరతంబు, మతినీవు మనో
హార ఋతువతంస మగుటను
సరిపోయెను నీకు నీవసంతాఖ్యయిటుల్ !'

అని వసంత నామసార్థక్యాన్ని సహజ సుందరంగాను, చమత్కారంగాను సమర్థించారు. పైపద్యయుగళంలోని, రెండో పద్యమందలి సారస్యచమత్కారం సద్యోహృద్యము – అనవద్యము. మరకతము – మకరతముగను, వతంసము – వసంతముగను వర్ణవ్యత్యయాన్ని పొందాయని కవిగారి సంభావన. 'మకరతము' అనునది 'మరకతము' యొక్క మారురూప మని 'శబ్దరత్నాకరము' చెప్పుతున్నది. 'వసంతము' అనునది 'వతంసము' యొక్క రూపాంతర మని చమత్కరించటం కవిగారి ప్రతిభాజన్యము. 'వతంసము' అనునది శ్రేష్ఠతావాచకము. ఋతువులలో కెల్ల శ్రేష్ఠమైనది 'వసంతము'. అంతేకాక వసంతము 'ఋతురాజు' అనే ప్రతీతి వున్నది. అందుచేత వసంతానికి నామసార్థక్యం చేకూరిం దని కవిగారితో పాటు మనంకూడా అంగీకరించాలి. ఋతునామానికి సార్థక్యహేతువు నూహించటమే పద్యధోరణిని చాటుతున్నది. అందులోను, కవిగారు చూపించిన పైహేతువు పరమోత్కృష్టహర్షదాయకమైన విలక్షణతతో విరాజిల్లుచున్నది. *

1. 'నవతోరణం' (వ్యాససంపుటి) డా. జి. వి. కృష్ణారావు. పుట. 170
2. అమరకోశము : పుట. 96
3. ఋతువిలాసము – పరిచయము. పుట. 12
4. అమరకోశము : పుట. 101
5. 'నిటల మర్ధచంద్రుడు' – అనేకవి గారి ప్రయోగం 'విజయవిలాసము' లోని 'చందనగంధి నెన్నుదురు చందురులో సగఁబాల...' (ప్రథ. ఆ. పద్య.149) అనే వర్ణనమూ, 'మనుచరిత్ర' లోని 'అర్ధచంద్రుని తేట నవఘళింపు లలాటపట్టిఁ దీర్చిన గంగ మట్టితోడఁ' (తృ. ఆ పద్య. 71) అనే వర్ణనమూ తలపిస్తున్నది. మిగిలిన వర్ణనలనుకూడా పూర్వకవుల ప్రయోగాలతో సమన్వయం చేసుకోవచ్చు.

..........

# 'చాణక్య నీతి దర్పణము'

## (రాజు – రాజ్య లక్షణాలు)

– కుమారి పి. కుసుమ, ఎం. ఏ.

నవనందులపై ప్రతినబూని తన అనన్య ధారణ రాజనీతిజ్ఞతతో ఎత్తుకు ఎత్తులువేసి, దాసీపుత్రుడని హేళన చేయబడిన చంద్రగుప్తమౌర్యుని సింహాసనాన్ని అధిష్ఠింపజేసి, తాను గెలిచిన తర్వాతనే జుట్టును ముడి వేసుకున్న అపూర్వ రాజకీయ దురంధరుడు చాణక్య వర్యుడు, పాలకుల అన్యాయాన్ని అరికట్టి, కాణేలీపుత్రునికిపట్టంగట్టిన ప్రచండ ప్రజ్ఞాశాలి చాణక్యుడే! చంద్రగుప్త మౌర్యుని కుడిభుజంగా ఎత్తిన ధ్వజాన్ని దించకుండా పాలించిన ఘనుడు.

కౌటిల్యుడు తన అనుభవసారాన్ని వడబోసి రచించిన గ్రంథరాజమే 'అర్థశాస్త్రము'. అది ప్రాచీన భారతీయ రాజనీతుల దర్పణము. అర్థశాస్త్రముతో పాటు పండితుల దృష్టికి రాని మరో గ్రంథాన్ని కూడ చాణక్యుడు రచించాడు. అదే 'చాణక్యనీతిదర్పణము', ఇది స్త్రీ, విప్ర, విద్యాది సాంఘిక ధర్మాలను పూసగుచ్చినది. ధనధాన్య సైన్యాది ఆర్థిక విశేషాల ప్రాముఖ్యాన్ని తన సూత్రాన నిలిపినది' మంత్రి, రాజలక్షణాదులను మాల కూర్చినది. ఇది అదియననేల సర్వసంఘోపయుక్త విశేషాల సమాహార మణిహారమే ఈ 'చాణక్యనీతి దర్పణము'.

'నీతిదర్పణ' శ్లోకాలన్నీ వివిధశాస్త్ర గ్రంథాలనుండి ఏర్చికూర్చిన అపూర్వ రత్నాలు. చాణక్యునిదృష్టిలో భూమిలో మూడే రత్నాలు. 'పృథివ్యాం త్రీణి రత్నాని। జల మన్నం సుభాషితమ్॥' మూఢులు పాషాణ ఖండాల్ని రత్నాలుగా భావిస్తారట! ఈ సుభాషిత రత్నాలు వివిధ గ్రంథాలనుండి గ్రహించబడినవి. దీనినే చాణక్యుడు మొదట చెప్పాడు.

'నానా శాస్త్రోద్ధృతం వక్ష్యే।' నానా శాస్త్రాలనుండి ప్రతిగ్రహించాడట! అవి 'రాజనీతి సముచ్చయం।' నడుం నొప్పి పెట్టేట్టు ఈ వెదకులాట ఎందుకట.

'లోకానాం హితకామ్యయా!
యస్య విజ్ఞాన మాత్రేణ।
సర్వజ్ఞత్వం ప్రతిపాద్యతే॥'
లోకుల హితం కోరాడు.

విజ్ఞానమాత్రము చేతనేసర్వజ్ఞత్వాన్ని పొందునట! అందుకే 'నేను సమకూర్చుచున్నాను.' '(తదహంసంప్రవక్ష్యామి,') అని ఢంకా బజాయించి చెప్పాడు.

'చాణక్య నీతిదర్పణమ్'లో రాజనీతిని గూర్చిన శ్లోకాలన్నీ చాణక్యుని భావాలకు ఎత్తిపట్టిన మణి దర్పణాలు.

రాజు ఎలా ప్రవర్తిస్తే తనరాజత్వాన్ని పదికాలాలపాటు నిలుపుకోగలడో ఇలా చెప్పాడు చాణక్యుడు. 'భ్రమన్ సంపూజ్యతే రాజా!' దేశంలో ప్రజల యోగక్షేమాలనరయుటకోసం తిరుగుతూ ఉంటేనే రాజు పూజింపబడతాడు. ఇచ్చట 'రాజ' శబ్దం సాభిప్రాయంగా ప్రయోగించబడినది. 'చక్రవర్తీ సార్వభౌమాది' పదాలు సమస్తభూమి నేలే రాజుకు వర్తిస్తాయి. కాని 'రాజన్' శబ్దం ప్రజలను పాలించే క్షత్రియునికి అనువర్తిస్తుంది. ('రాజా రాట్ పార్థివః క్ష్మాభృత్ నృపః...'– అని అమరకోశమ్. ప్రజాపాలకుడే అసలు సిసలైన రాజు. అలాంటి రాజు రాజుగా మనగలగాలంటే సైన్య, భుజబలాలు, వానితోపాటు ప్రజాబలంకూడా ఉండా అని గుర్తించిన మహా రాజకీయవేత్త చాణుక్య మహామంత్రి.

రాజుకు సైన్యము, బాహువీర్యము బలం. 'బాహువీర్యం బలం రాజ్ఞః' 'బలం విద్యా చ విప్రాణాం। రాజ్ఞాం సైన్యం బలం తథా॥' విప్రులకు విద్య ఎలాగో రాజులకు సైన్యం అలాగే బలం. రాజు శత్రువులపట్ల ఎలా ప్రవర్తించాలి?

'అనులోమేన బలినం।
ప్రతిలోమేన దుర్బలమ్।
ఆత్మతుల్యం బలం శత్రుం।
వినయేన బలేన వా॥'

తనకన్న బలవంతుని అనుకూలత చేతను, దుర్బలుని ప్రతికూలత చేతను, సమానుడైన శత్రువును వినయం చేత గాని, బలం చేత గాని, సాధించాలి.

రాజుకు సైన్యంకంటే ఎక్కువ అవసరమైనవి మంచి, సనుయస్ఫూర్తియుతమైన సలహాలు. కుటిలమైన వాక్కులని వినినవాడు ఊబిలో దిగపడటం ఖాయం. అందుకే

---

* నిన్న : నాలుగుమాసములలో అపార్టీ ఏమంచి పనీ చేయలేక పోయింది.

* నేడు : మంచిపనులు ఏవిచేయడానికీ మా పార్టీకి 8 నెలలు చాలా స్వల్ప కాలం.

'మంత్ర హీనాశ్చ రాజానః ।
శీఘ్రం వినశ్యతి॥' అన్నాడు.
'రాజా రాష్ట్రకృతం పాపం ।
రాజ్ఞః పాపం పురోహితః'

రాజు చేసిన పాపానికి పురోహితుడు (అనగా మంత్రి । ఆ రోజులలో పురోహితుడే మంత్రివలె వ్యవహరించేవాడు.) బాధ్యుడు. రాజేమో ప్రజలు చేసిన పాపాలకు బాధ్యుడు. ఇదెలా సమర్థనీయం ? ప్రజాకృత పాపాలకు ముమ్మాటికి రాజే బాధ్యుడు. ఎందుచేతనంటారా ? రాజు ధర్మజ్ఞుడు ఐతే ప్రజలూ ధర్మపరులౌతారు. రాజు పాపి అయితే పాపాలు చేయటంలో ప్రజలదీ అందె వేసిన చేయి అవుతుంది. ప్రజలు రాజునే ఆదర్శంగా అనుసరిస్తారు. రాజెలానో ప్రజలూ అలానే ! అందుకే చాణక్యుడు తెల్పిన ఈ శ్లోకం అతి ప్రఖ్యాతిని పొందినది.

'రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః
పాపే పాపాః సమే సమాః
రాజాన మనువర్తంతే
యథా రాజా తథా ప్రజా ॥'

ఈ ఒక్క శ్లోకంలోనే సర్వ రాజనీతి ఇమిడిపోయింది. ప్రజలను కన్నతండ్రి వలె పాలించగలిగిన రాజే రాజు. అతడే వందనీయుడు.

కాని ఏ రాజూ తన పిల్లలకు రాచరికపు వారసత్వాన్ని ఇవ్వటానికే పాటుపడ్డాడు గాని, ప్రజలను కన్నబిడ్డలవలె రక్షించి పాలించాలని తాపత్రయ పడలేదు. ఈ విషయాన్ని కౌటిల్యుడు గుర్తించాడు కాబోలు. అందుకే కోపంగా 'నదీనాం సఖీనాం...' అంటూ ఓలిస్టు ఇచ్చి, వారితోపాటు 'రాజును కూడా నమ్మవద్దు.' అన్నాడు. 'అతిదగ్గరగా వర్తిస్తే నశిస్తారు. దూరంగా ఉంటే ఫలమేమీ దక్కదు. కాబట్టి మధ్యేమార్గాన సేవించవున్నాడు. ఎవరిని ? 'రాజా, వహ్నిః గురుః । స్త్రియః' రాజుకోపిష్ఠి । కటిలుడూ అయితే ఎంతో కాలం నిలవలేడు.

'విత్తేన రక్ష్యతే ధర్మః । విద్యా యోగేన రక్ష్యతే । మృదునా రక్ష్యతే భూపః॥' ధర్మం డబ్బువలన రక్షించబడుతుంది. డబ్బే లేనివాడు తన జానెడు పొట్టకోసం ఎలాటి అక్రమానికైనా వెనుదీయడు. క్షుధార్తి 'సత్యం పియూషవత్ పిబ ! మొదలైన ధర్మవన్నాలన్నిటినీ ఆవలకి తోసేస్తుంది మరి ! అందుకే 'ఆకలి బాధ' ఆ మాటనే తెలీనివాడే, అంటే డబ్బుంటేనే ధర్మం రక్షించబడుతుంది. విద్య అభ్యాసం చేత, రాజు మృదువుగ మసలితేనే రక్షించబడును.

రాజు దుర్మార్గుడు, అధర్మపరుడూ అయినపుడు రాజ్యం అల్లకల్లోలమైనపుడు ఏం చేయాలి ?

'కురాజరాజ్యేన కుతః ప్రజాసుఖమ్ ?'
అందుకనే ఒక పేమాట_
'వరం న రాజ్యం న కురాజరాజ్యమ్।'
అని ఘంటాపథంగా వ్రాకుచ్చాడు.

'చెడ్డ రాజ్యం కంటె అసలు రాజ్యమే లేకపోవటం మేలంట' నిజమే కదా ? ఇది సార్వకాలిక నగ్నసత్యం.

'శుచిః క్షేమకరో రాజా॥' నిష్కపటంగా ధర్మపథానుగామి, ప్రజాక్షేమంకరుడునైన రాజే ప్రజలచేత పూజింపబడతాడు. అలాటి రాజ్యంలోనే ప్రజలు సత్యాన్ని అమృతంవలె సేవించ గలుగుతారు.

'శాంతితుల్యం తపో నాస్తి॥' అన గలుగుతారు. 'అజాగలస్తనం (మేక మెడకిందిచన్ను) వలె నిరర్థకం కాకుండ, ధర్మార్థ కామమోక్షాలను సాధించి తమ జీవితాలను సార్థకం వరచుకోగలుగుతారు.

—...—

# మా (నవ) లీల

- శ్రీ ఉమ్మిటి విఘ్నేశ్వరరావు



* చిక్కని చీకటిలోనే
నొక్కడనే. నే వినామరొక ఛాయను
వెక్కడ వెదకినఁ గానీ
దక్కదు నే కన్నుపొడిచి దర్శింపగా

* పగటి ఎండను రెండుగాపమ్ము లె
నేను నొకటి రెండవది నానీడ, ఇంకె
కాక ఎన్ని దీపాలెన్ని కాంతులు విర
జిమ్ము నన్ని ఛాయల విరాజిల్లఁగలను.

మనుజాల బట్టి, వారలు క్ష
మాస్థలి వర్తిలు పద్ధతుల్ విలో
కన మొనరించి వాటి కెన
గా అవతారములన్ ధరించి నే
నునటులె వారితో నెనరు
నూల్కొన జీవన యాత్ర జేయుదున్
ఘనముగ నెక్కు రూపములఁ;
గానుజూడ హరి నే నరుండ నే.



* చేసిన పొరపాటునకు పశ్చాత్తాపపడి క్షమార్పణ చెప్పికొన్న మరల మాలో చేర్చుకుంటాం.

- వార్త

* మీలో చేరిన మనకు మరల పశ్చాత్తాప పడవలసి వస్తుందేమో అని సందేహం.

## * వార్షిక సంచిక *

బరు 1 వ తేదీని వెలువడే సమాలోచన సంచిక ప్రత్యేక రచనలతో వార్షిక సంచికగా వెలువడును. రచయితలు సహృదయతతో సహకరింపం గోరిక.

వార్షిక సంచిక విడిప్రతి మూల్యము రు. 1-50.

## * చదువరులకు *

పరిస్థితుల ప్రాబల్యంవల్ల సమాలోచన సంవత్సర చందా రు. 12-00 లకు, విడిసంచిక వె 60 పైసలకు నవంబరు 1 నుండి హెచ్చింప బడినది. నవంబరు 1 లోగా చందాదార్లుగా చేరినవారి పూర్వపు 10 రు॥ లకే వారి చందా పూర్తి అయ్యేవరకు పంపబడును.

## * గమనిక *

1 వ సంపుటము వాల్యూములు అయిపోయినవి. రెండవ సంపుటము కొలది ప్రతులు ఉన్నవి నవంబరు 1 తరువాత మూడవ సంపుటము హాఫ్ క్యాలికో బైండుతో సప్లయి చేయబడును. పోస్టేజీతో సహా వాల్యూము వెల రు. 20 లు ఎం. ఒ. చేసిన రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వి. పి. పద్ధతి లేదు

— సంపాదకుడు

అడ్రసు :—
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V. & Co, Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.